# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY
# DEBATES

[ *Part II—Proceedings other than Questions and Answers* ]

*OFFICIAL REPORT*

---

*Fifty second Day of the Sixth Session of the*

*Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Wednesday, the 26th March* 1958

The House met at Half Past Eight of the Clock

[ MR. SPEAKER IN THE CHAIR ]

## QUESTIONS AND ANSWERS

( SEE PART I )

## BUSINESS OF THE HOUSE

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) : ఈ సమావేశం దాదాపు ముగింపుకు వచ్చినది. మళ్ళీ సెషన్ ఎప్పుడు జరుగుతుంది? మేము మళ్ళీ ప్రశ్నలు పంపాము. సెషన్ prorogue అయితే అవి lapse అవుతాయేమో. కనుక information చెబితే మా పాత questions ఉంటే ముందే జాగ్రత్తపడి ఆఫీసులో కనుక్కొని తీసుకొంటాము.

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి) : ఇది short notice question కాదు. surprise notice question (నవ్వు) ఈ నెల 31 వ తేదీన adjourn అవుతున్నాము. Prorogue అవుతుందా అనే విషయం — it depends on so many administrative grounds. తిరిగి జూన్ మొదటివారములో సమావేశం అవుతుందేమో. ఇప్పుడు గట్టిగా చెప్పలేను.

శ్రీ ఇ. నాగయ్య (పరవడ) : నేను short notice question పంపి మూడు నెలలయినది. Long notice question అయినప్పటికీ యీపాటికి రావాలి. ఇంతవరకు జవాబు రాలేదు. ఆ ప్రశ్నకు information ఎక్కడనో దూరమునుంచి రానక్కరలేదు. Labour Commissioner Office నుంచి రావాలి. సంజీవయ్యగారికి తెలుసు. దానికి జవాబు తెప్పించుటలో యింత ఆలస్యం ఎందుకు అవుతున్నదో తెలియుటలేదు.

కార్మికశాఖమంత్రి (శ్రీ డి. సంజీవయ్య): Short notice question స్పీకరుగారికి పంపిస్తారు. Whether notice should be waived or not అనేది మినిస్టరుకు వ్రాసి చేస్తున్నారా?

మిస్టర్ స్పీకర్: లేదు. Short notice question allow చేయడమా లేదా అనేది పూర్తిగా స్పీకర్ యొక్క discretion లో ఉంటుంది. దానికి జవాబు వెంటనే చెప్పగలరో లేదో అది మినిస్టరుగారియొక్క discretion లో ఉంటుంది.

శ్రీ యన్. సంజీవరెడ్డి: అధ్యక్షా, వెంటనే జవాబు చెప్పాలనే మా ఉద్దేశం, కాని short notice question అయినా దానికి జవాబు ఎక్కడనో జిల్లాలనుంచి తెప్పించవలెనంటే టైము పట్టుతుంది. వారు అడిగినప్రశ్నకు సమాచారం మావద్దయుంటే వెంటనే చెప్పగలము. లేకపోతే time తీసుకుంటుంది.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వదమలపేట): నేను మూడు short notice questions పంపాను. రెండు ప్రశ్నలు Irrigation Minister కు సంబంధించి, ఒకటి Education Minister కు సంబంధించి ఉన్నవి. వాటి జవాబులు 31 వ తేదీలోపల వస్తాయా? Irrigation Minister గారికి పంపిన వాటిలో అమ్మపల్లి ప్రాజెక్టుగురించి, యింకొక ప్రాజెక్టుగురించి అడిగాను. వాటికి జవాబులు ఎప్పుడు వస్తాయో మంత్రిగారు చెప్పగలరా?

నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి (శ్రీ జె. వి. నరసింగరావు): Information లేదని చెప్పడానికి ఎప్పుడైనా చెప్పవచ్చును. కావలసిన జవాబు చెప్పవలెనంటే information వచ్చిన తరువాత చెప్పవలసియుంటుంది.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం): మన రూల్సులో, మామూలు ప్రశ్నలకు 30రోజులలో జవాబు చెప్పితీరాలని ఉన్నది. Extraordinary గా ఏదైనా ప్రశ్నకు యింకా కొంతటైము కావలసియుంటే extension యివ్వటానికి అవకాశం ఉన్నది. అంతేగాని, ప్రతి question కు extenstion యిస్తే, ఈ రూల్సు నిరుపయోగం అయిపోతాయి. ఈ రూల్సు revise చేయాలన్న సందర్భం వచ్చినప్పుడు, ముఖ్యమంత్రిగారు చెబుతూ 21 రోజులలోనే సమాధానాలు తెప్పించుటకు అంగీకరించారు. అందుచేత 30 రోజులనుంచి 21 రోజులకు మంత్రివర్గం అంగీకరిస్తే, 30 రోజులనుంచి 45 రోజులవరకూ పెంచడం ఏమీ ఉపయోగంగా ఉండదు. Short notice question అయితే, అయిదారు లేక వారము రోజులలో జవాబు చెప్పితే ప్రయోజనం గాని, వారి యిష్టము వచ్చినప్పుడు చెపుతామంటే, అది short notice question కాదు. అందువల్ల ఈ విషయాలన్నీ సాకల్యంగా పరిశీలించి వచ్చే సెషన్‌నుంచి అయినా ఉన్న రూల్సు ప్రకారం అమలు జరపకపోతే శాసనసభ తన కర్తవ్యాన్ని నెరవేర్చ

నట్లుకాదు. ముఖ్యమంత్రిగారు ఈ విషయం సీరియస్‌గా ఆలోచించగలందులకు తమద్వారా వారిదృష్టికి తీసుకువస్తున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : షార్ట్ నోటీసు క్వశ్చన్‌కు గడువు ఏమిటి?

మిస్టర్ స్పీకర్ : 'షార్ట్‌నోటీసు క్వశ్చన్' విషయంలో గడువంటూలేదు. If the Speaker is of opinion that the question is of an urgent character, he may direct that an enquiry may be made from the Minister concerned, if he is in a position to reply and, if so, on what date. అని ఈ రూల్సులో ఉన్నది. I am not in a position to reply అని అంటే మాత్రం నేను చెప్పలేను. వీలైనంతవరకు వారు ఒకే చేస్తారు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : నేను ఆ క్వశ్చన్ పంపించి వారం రోజులైంది. అది మీరు వారికి పంపించారా ? వారు రిప్లయి చేస్తామన్నారా లేదా అని నేను అడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : అప్పుడే పంపించాము. మళ్ళీ వారు నాకు వ్రాయరు. దానినిగురించి మళ్ళీ వ్రాశారా అంటే, ప్రతిదానికి మేము వ్రాయము. మా కరస్పాన్‌డెన్స్...

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : తమరు వ్రాయకపోతే మేము రాస్తామా అండి ? మీరు షార్ట్ నోటీసు క్వశ్చన్ తీసుకొన్నప్పుడు, వారికి వ్రాసి, వారు రిప్లయి ఇస్తారో లేదో తెలుసుకోవలసిన బాధ్యత ఎవరిది ?

మిస్టర్ స్పీకర్ : ఎవరిదీ లేదు. (నవ్వు) మేము ఆ క్వశ్చన్ మంత్రికి పంపుతాము. వారు ఇచ్చు రిప్లయి నా దగ్గరకు వచ్చినతర్వాత, దానిని మీ ఎదుట పెడతాము. అంతేతప్ప "మీరు జవాబుదారి" అంటే నేను జవాబుదారీ కాదు.

It must come in the usual course and the hon. Ministers are expected to give such information as is possible, within as short a time as possible.

*Sri R. B. Ramakrishna Raju*: What is the usual course for short notice question ?

మిస్టర్ స్పీకర్ : మేము వ్రాశాము. ఆ డిపార్టుమెంటువారు దీనిని ఆర్డినరీగా తీసుకోమన్నారు. What I have written earlier cannot be revoked, అని వ్రాశాము. మేము ఒకసారి ఆర్డర్ వేసిన తర్వాత, రివోక్ చేసేది లేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి: అధ్యక్షా, వారు ప్రాజెక్టు విషయం అడిగి ఉంటారు. ఏదైనా ఒక అర్జంట్ మేటర్ ఉన్నప్పుడు షార్ట్‌నోటీసు క్వశ్చన్ వేస్తే

మేము టెలిఫోన్‌ద్వారానైనా ఇన్‌ఫర్మేషన్ తెప్పించి సభ్యులకు తెలియ జేస్తాము. "వారు ఏదో అర్జంట్ విషయం అడిగినారు; ఏదో ప్రమాదం సంభవించి ఉంటుంది; ఎక్కడో కష్టం జరిగింది; దీనినిగురించి వెంటనే ఇన్‌ఫర్మేషన్ తెప్పించాలి" అని మాకు కూడ వాటినిగురించి తెలుసుకోవాలనిఉంటుంది. అంతేగాని ఒక ప్రాజెక్టు గురించి ఏమయిందని షార్ట్ నోటీసు క్వశ్చన్ అడిగితే, ఏ మినిస్టర్ అయినా వెంటనే ఆన్సర్ చెప్పగలడా, అని అడుగుతున్నాను. షార్ట్ నోటీసు క్వశ్చన్స్ స్పెషల్ కేసెస్‌క్రింద వస్తే మేముకూడ స్పెషల్‌గా ట్రీట్ చేస్తాము. మిగిలిన క్వశ్చన్స్ ఆన్సర్ చేయటం గురించి సుందరయ్యగారు చెప్పారు.

I have absolutely no objection. Please follow the rules. We will simply say whatever information is available. We have absolutely no objection. Please follow the rules strictly.

మిస్టర్ స్పీకర్ : ఆర్డనరీ క్వశ్చన్స్‌కు రిప్లయి రావటానికి చాలా డిలే అవుతున్నదని నేను ఇదివరకే చెప్పాను. నేను ఎలౌచేసే షార్ట్‌నోటీసు క్వశ్చన్స్ నిజంగా షార్ట్‌నోటీసు క్వశ్చన్స్ కావు. ఆర్డనరీ క్వశ్చన్స్‌కు రిప్లయి రావటానికి చాలా ఆలస్యం అవుతున్నది. ఈ లోపలే ఇన్‌ఫర్మేషన్ తెప్పించమని కొంతమంది ముఖ్యులు కోరుతున్నారు. 50 షార్ట్‌నోటీసు క్వశ్చన్స్ వస్తే, రెండు మూడు మాత్రమే ఎలౌ చేశాను. ఇకముందు చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాను. అర్జంటు మేటర్ ఉన్నప్పుడు మాత్రమే షార్ట్‌నోటీసు క్వశ్చన్ వేయాలి. Other things cannot be treated as short notice questions.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : అధ్యక్షా, మీరు దానిని షార్ట్‌నోటీసు క్వశ్చన్‌క్రింద ట్రీట్‌చేయటం లేదని అంటే, అసలు నేను ఆ క్వశ్చన్ వేసి ఉండను. "ఆ ప్రాజెక్టు ఎన్ని దినాలుగా జరుగుతోంది, దానిని గురించి ఏమయినది" అని నేను అడిగిన ప్రశ్నను షార్ట్‌నోటీసు క్వశ్చన్‌గా మీరు ఎలౌ చేశారు. ఇది అంత అర్జెంటు కాకపోవచ్చును. మేము ఈ ప్రాజెక్టుగురించి అనేక విధాల వ్రాసుకొన్నాము. వాటికి ఇంతవరకు జవాబులేదు. అక్కడ ఉన్న ఇంజనీర్‌గారిని అడిగి, నాలుగు రోజులలో మినిస్టర్‌గారు జవాబు తెప్పించవచ్చును.

(At this stage, many Members rose in their seats to speak)

మిస్టర్ స్పీకర్ : కూర్చోండి. ఇటువంటి వాటిల్లో లీడర్ ఆఫ్ ది పార్టీస్ కు తప్ప, తక్కిన మెంబర్స్ తేస్తే, నేను ఎలౌ చేయను.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) : పాయింట్ ఆఫ్ ఆర్డర్ సర్- నేను 74 వ రూలు క్రింద మీకు ఒకటి ఇచ్చాను. ఆ విధంగా నేను ఇచ్చి

వారం రోజులయింది. రూలు 74 క్రింద చెప్పటానికి కూడ ఎక్కువ టైమ్ తీసుకోవటం న్యాయంకాదు కాబట్టి, కనీసం వారం రోజులలోపలైనా, ఇన్‌ఫర్మేషన్ తెప్పించి పెట్టటం అవసరమని చెబుతూ, దీనివిషయం ఏమి జరిగిందో చెప్పాలని కోరుతున్నాను.

*Mr. Speaker :* I shall consider about it.

శ్రీ యస్. పి. వంగల్రాయనాయుడు (వేపంజేరి) : పాయింట్ అఫ్ ఆర్డర్ సర్ - ఇటువంటి విషయాలలో పార్టీలీడర్స్ మాత్రమే మాట్లాడాలన్నారు. అపోజిషన్ మెంబర్లు అయితే, ఆవిధంగా మాట్లాడవచ్చును. అపోజిషన్‌పార్టీ లీడర్స్ మాట్లాడవచ్చును. మేము (ప్రభుత్వపక్షము) ప్రభుత్వంగురించి చెప్పాలంటే ఎట్లా ?

మిస్టర్ స్పీకర్ : మా చాంబర్‌లోకివచ్చి చెప్పవచ్చును.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : పాయింట్ అఫ్ ఆర్డర్ సర్ - ప్రభుత్వంపైన విమర్శచేయదలచుకొంటే, చాంబర్‌లో విమర్శ చేస్తే ఏమిలాభం ఉంటుంది ? ఇక్కడే విమర్శిస్తే బాగుంటుంది (నవ్వు)

మిస్టర్ స్పీకర్ : ఏమైనా ఇటువంటివివస్తే నాతోచెప్పవచ్చునని అంటున్నాను. కాని మీరు విమర్శచేయకూడదని అనటంలేదు. రోజూ అందరూ విమర్శిస్తూనే ఉన్నారు. బహుశా కాంగ్రెసు పార్టీవారుకూడ కొందరు విమర్శిస్తూన్నారేమో !

## BUDGET - DEMANDS FOR GRANTS

*DEMAND NO. XXXVI — Local Administration— Rs.* 46,96,400.

*The Minister For Local Administration (Sri K. Brahmananda Reddy)* : Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I beg to move :

"That the Government be granted a sum not exceeding Rs. 46,96,400 under Demand No XXXVI - Local Administration".

*Mr. Speaker* : Motion moved.

*శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : అధ్యక్షా, యీ లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ డిమాండ్ ప్రప్రథమంగా ఈ సంవత్సరం ఏర్పాటుచేయబడినందులకు, అందులో నూటిగా నేరుగా గౌరవసభ్యులు సూచనలు సలహాలు, విమర్శలు చేయటానికి ఈ సభకు అవకాశం దొరికినందులకు, నేను చాలా సంతోషిస్తున్నాను. ఇన్ని సంవత్సరాలనుండికూడ "లోకల్ ఎడ్మినిస్ట్రేషన్" అని ప్రత్యేకంగా ఒక డిమాండ్ ఏర్పరచబడలేదు. కాని లీడర్ అఫ్ ది అపోజిషన్ అయినటువంటి

శ్రీ సుందరయ్యగారు, ఎక్బోటేగారు, ఇంకా ఇతర మిత్రులు పోయిన సంవత్సరం బడ్జెటు జనరల్ డిస్కషన్‌లో ఈ ప్రశ్నను లేవదీసి, తప్పకుండా వచ్చే సంవత్సరంలో లోకల్ ఎడ్మినిస్ట్రేషన్‌కు ఒక సెపరేట్ డిమాండ్ ఏర్పాటు చేయవలసినదని సూచన చేశారు. వారియొక్క సూచనను ఈ ప్రభుత్వం అంగీకరించి, ఈ సంవత్సరం దీనికి ఒక ప్రత్యేక డిమాండ్ ఏర్పాటు చేయటం జరిగింది. ఇది చాలా శుభసూచకమని అనుకొంటున్నాను. ఎందుకంటే, ఎప్పుడైతే మనం పోలీసు స్టేటునుండి వెల్‌ఫేర్ స్టేటుకు మారాలని, శీఘ్రగతిని ఈ దేశంలో అందరికి కొన్ని సౌకర్యాలు కలుగజేయాలని, ఆతురత పడుతున్నామో, అటువంటి సందర్భంలో యీ స్థానిక సంస్థలకు ప్రత్యేకంగా ఒక డిమాండ్‌ను ఏర్పాటుచేయటం చాలా శుభసూచకమైన విషయము. ఇందువల్ల స్థానికసంస్థలో ముఖ్యభాగమైన పంచాయితీలకు ఎక్కువ బాధ్యతలు అధికారాలు అప్పగించి, తద్వారా ఎక్కువ కార్యక్రమాలు అమలుజరుపుకోటానికి అవకాశం ఉంటుంది అనేటటువంటి నమ్మకం మన అందరికి కలుగుతుంది.

కేంద్ర ప్రభుత్వములో కమ్యూనిటీ డెవలప్‌మెంటు మంత్రిగా ఉన్న యస్. కె. డే. గారు పంచాయితీ శాఖను ప్రత్యేకంగా ఏర్పాటుచేసి, దానికి మంత్రిగా నిర్వహించబోతారని ఇటీవలనే నేను విన్నాను. అందుకు నేను చాలా సంతోషించాను. రానున్న రోజులలో రాష్ట్రప్రభుత్వాల మీద కేంద్ర ప్రభుత్వములో యీ పంచాయితీ బోర్డుల నిర్వహణను గురించి ఎక్కువగ దృష్టిలో పెట్టుకోబోతున్నారు. దీనివల్ల పంచాయితీబోర్డుల పరిపాలన ఎక్కువ పటిష్ట మవుతుందని స్పష్టమవుతున్నది. ఈ డిమాండును ప్రతిపాదించేటప్పుడు నేను దీనిని గురించి దీర్ఘోపన్యాసము చేయదలచలేదు. అయినను ఈ డిమాండుకు సంబంధించిన కార్యక్రమములను గురించి కొంతవరకు సభ్యులకు తెలియజేసి నట్లయితే వారియొక్క విమర్శలు గాని, సలహాలు గాని ప్రభుత్వానికి తెలియజేస్తేబాగుంటుందేమోనని అనుకుంటున్నాను. ఇప్పుడు **Local Administration** కు సంబంధించినంత వరకు కొన్ని వివరాలను తెలిజేస్తున్నాను. రాష్ట్రములో జిల్లాబోర్డులు, **Corporations, Municipalities,** పంచాయితీలు ఉన్నవి. వీటిద్వారా **Local Administration** నడపబడుతున్నది. ఆంధ్రప్రాంతములో పదకొండు జిల్లాలు ఉన్నవి. తెలంగాణాలో తొమ్మిది జిల్లాలు ఉన్నవి. ఆంధ్రలో ఉన్న జిల్లాబోర్డులు ప్రస్తుతము **Special Officers** యొక్క నిర్వహణలో ఉన్నవి. వీరికి సహాయము చేయటానికి **P. A.** లు అని నియమింపబడియున్నారు. వీరిద్వారా జిల్లాబోర్డు కార్యక్రమములు జరుగుతున్నవి. ఇక తెలంగాణా ప్రాంతములో ఉన్న జిల్లాబోర్డులు అన్నీ **nominated bodies** గానే ఏర్పాటు చేయబడినవి. జిల్లా కలెక్టర్లు చేర్మన్లుగా గాని, ప్రెసిడెంట్లుగా గాని ఉంటున్నారు. సభ్యులు ఎప్పుడో చాలాకాలముక్రింద నామినేట్ చేయబడియున్నారు.

వీరిద్వారా తెలంగాణాలో జిల్లాబోర్డు వ్యవహారాలు నిర్వహింపబడుతున్నవి. ఇకముందు ఈ జిల్లాబోర్డుల భవిష్యత్తు ఏ విధముగ ఉండబోతుందో సభ్యులందరికి తెలుసును. ప్రభుత్వము దీనిని గురించి ఒక White Paper ప్రచురించింది. దానిమీదట గౌరవ సభ్యులు కొంతవరకు చర్చించారు. ప్రభుత్వానికి ఇవ్వదగిన సూచనలు యిచ్చారు. ఇప్పుడు మరల నేను ఈ విషయమును గురించి చెప్పవలసిన అవసరము లేదనుకుంటాను. జిల్లాబోర్డుల స్థానములలో Block Councils ను ఏర్పాటు చేయడమే కాకుండా, ఇవి ఎప్పుడైతే ఏర్పాటు అవుతాయో, అప్పటినుంచి క్రమక్రమేణ జిల్లాబోర్డులు అన్నీ అదృశ్యమైపోతాయి. ఇది ఒక నిర్ణయమని ఆ White Paper ద్వారా ప్రభుత్వము చెప్పగలిగింది. అయితే ఈ Block Councils ను యింతవరకు ఎందువల్ల ఏర్పాటు చేయలేదు అని కొంతమంది సభ్యులు అడగవచ్చు. ప్రభుత్వము ఈ White Paper ప్రచురించిన తరువాత అసలు ఉన్న Madras Local Boards Act అనే చట్టము క్రిందనే, ప్రభుత్వముయొక్క Executive Order ద్వారా యీ బ్లాకు కౌన్సిల్సును ఏర్పాటు చేయటానికి అవకాశము ఉన్నదా, లేదా అని Law Department వారిలో సంప్రదించాము. ఇప్పటి చట్టము ప్రకారము ఆ విధముగ చేయటానికి వీలులేదని వారు దానికి వేరే Amending Bill ద్వారా తప్ప, వీలులేదని opinion ఇచ్చారు. అందువల్ల యిప్పుడు తెలంగాణాకు వర్తించే యాక్టును Madras Local Boards Act ను, రెండును సమన్వయపరచి ఒక Short Bill ను తెస్తేనేగాని, యీ కౌన్సిల్సును ఏర్పాటు చేయటానికి వీలు కలుగలేదు. ఆ ప్రకారము ఒక Amending Bill ను త్వరలోనే తయారుచేసి, రేపు మరల మనము యిక్కడ సమావేశమైనప్పుడు, మీ ఎదుట పెట్టదలచుకున్నాను. ఇంక ఈ రెండుప్రాంతాలలో ఉంటున్న జిల్లాబోర్డుల యొక్క ఆదాయమును గురించి మనవిచేస్తున్నాను. ఆంధ్ర ప్రాంతములో ఉన్న 11 జిల్లా బోర్డుల ఆదాయము అంతాచేరి 3 కోట్ల 92 లక్షల పైచిల్లర. తెలంగాణాలోని 9 జిల్లాబోర్డులయొక్క ఆదాయము 52 లక్షల 75 వేలు. ఇక వీటి ఖర్చుకూడ వివరిస్తున్నాను. ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంతవరకు వచ్చే ఆదాయముకంటె ఖర్చు సుమారు అయిదు లక్షల పైచిల్లర ఎక్కువగ ఉన్నది. ఇక తెలంగాణాకు సంబంధించినంతవరకు వచ్చే ఆదాయములో సగమే ఖర్చుచేస్తున్నారు. ఇక పోతే ఈ జిల్లాబోర్డులు చేసే కార్యక్రమములనుగురించి కూడ కొంతవరకు మనవిచేస్తున్నాను. Education కు సంబంధించి, కొన్ని High Schools ను మాత్రమే ఆంధ్ర ప్రాంతములోని జిల్లా బోర్డులు నిర్వహిస్తున్నవి. ఆంధ్ర 8,654 Elementary Schools ను కూడా నిర్వహిస్తున్నది. ఇవిగాక దాదాపు 700 Medical Dispensaries, ను, సుమారు మూడు Maternity Homes,

200 పైచిల్లర Weekly markets, 78,792 మైళ్ళ రోడ్డు కార్యక్రమములు నిర్వహిస్తున్నది. ఇక మునిసిపాలిటీసు విషయముచూస్తే, ఆంధ్ర ప్రాంతములో 41 Municipalities ఉన్నవి. ఇందులో Special grade Municipalities, First grade Municipalities, ఆదాయమునుబట్టి Second grade Municipalities, 3rd grade Municipalities ఈవిధముగ ఉంటున్నవి. ఇక తెలంగాణ ప్రాంతానికి సంబంధించినంతవరకు Hyderabad, Secunderabad Cities కు ఉన్న రెండు కార్పొరేషనులను మినహాయిస్తే, సిటీ మునిసిపాలిటీసు అనే పేరుతో 16 Municipalities ఉన్నవి. 64 Town Committees ఉన్నవి. బహుశా యీ Town Committees అంటే, ఆంధ్రలో Ist grade Panchayats తో సమానము అనుకుంటాను. ఎందువల్లనంటే అయిదువేల జనాభాకు మించి, పదివేల జనాభాకు మించకుండా ఉండేవి యీ category క్రిందకు వస్తాయి. ఇలాంటివి ఆంధ్ర ప్రాంతములో 215 ఉన్నవి. ఆంధ్ర ప్రాంతములో ఉన్న 41 మునిసిపాలిటీలనుంచి వచ్చే ఆదాయము అన్నిరకాలు చేర్చి లెక్కచూస్తే 4 కోట్ల 27 లక్షల పైచిల్లరవస్తుంది. తెలంగాణాలో ఉన్న 16 మునిసిపాలిటీలకు వచ్చే ఆదాయము చెబుతాను. అందులో రెండింటికి information లేదు. అవి మినహాయించి తక్కిన 14 మునిసిపాలిటీలకు అన్నింటికిచేరి 48 లక్షల 34 వేల పై చిల్లర ఆదాయము వస్తుంది. ఇక 64 Town Municipalities కు ఆదాయము విచారిస్తే, అందులో కొన్నింటికి information లేదు. తక్కిన 47 కు మాత్రము information ఉన్నది. వాటికిఆదాయము 44 లక్షల 32 వేల పైచిల్లర వస్తుంది. ఈ Municipalities 60 High Schools ను, 489 Elementary Schools ను, సుమారు 70 Libraries ను. 40 Reading Rooms ను, 70 dispensaries వగైరాలు నిర్వహిస్తున్నవి. ఇవి పోతే యిక్కడ రెండు Corporations ఉన్నవి. వీటియొక్క సమాచారము గౌరవసభ్యులకు తరువాత మనవిచేస్తాను. ఆంధ్ర ప్రాంతంలో Municipalities కు సంబంధించినంతవరకు Commissioners ను ఏర్పాటు చేశాము. వీటిలో కొన్ని categories లో Commissioners ఉన్నారు. ఇందులో III grade Commisioners కు 200 నుంచి 300 వరకు scale of pay ఉన్నది. II grade Commissioners కు 300 నుంచి 420 వరకు, I grade Commissioners కు 420 నుంచి 550 వరకు, తరువాత special grade Commissioners కు 550 నుంచి 850 వరకు Scale of Pay నిర్ణయించబడియున్నది. ఇది చాలా మంచి నిర్ణయము. ఇలాంటి grades పెట్టినందువల్ల ఆంధ్ర ప్రాంతములో ఎవరు కూడ అసంతృప్తి ప్రకటించలేదని మనవిచేస్తున్నాను. తరువాత అక్కడ Municipalities లో Revenue Officers అని, Managers ఉన్నారు. వాళ్ళయొక్క service, State service క్రిందకు తీసుకున్నాము. దానిని ఈ సభకూడ అంగీకరించింది. Enquiry Commissioner వారుకూడ

అంగీకరించారు. వారి సూచనమీదనే, ప్రభుత్వము అంగీకరించి యీ grades ను settle చేసింది. కనుక అక్కడ ఆంధ్రలో ఆ విధముగ కార్యక్రమములు జరుగుతూన్నవి. ఈ Local Administration కు సంబంధించినంతవరకు నాకు ఉన్న కొద్దిఅనుభవములో, ఇందులో కొన్ని చిక్కులుకూడ ఉంటున్నవి. ఆంధ్రలో Municipalities అన్న elected bodies యే. Nominated సభ్యులు ఒక్కరుకూడ లేరు. ఇక ఉద్యోగస్థులు చూస్తే Commissioners అని, Chief Executive Officer అని ఈ Municipalities లో పనిచేస్తూన్నారు. వీరితో బాటు ఉన్నత అధికార్లుగా ఇంజనీరు, Health officer కూడ పనిచేస్తూ ఉంటారు. ఈముగ్గురు ఉద్యోగస్థులలో understanding బాగా ఉండి, co-operation, co-ordination బాగా ఉంటే మునిసిపల్ కార్యక్రమాలు సక్రమముగ నడిచిపోతూ ఉంటాయి. కాని వీరిలో ఒక్కొక్కరి మధ్య అభిప్రాయభేదాలు వచ్చియుంటే, యిక ఆ మునిసిపల్ కార్యక్రమము కుంటుపడినట్లే. ఆవిధముగ జరగకుండా యీ ముగ్గురినీ ఒకనెల కొకసారి, రెండునెలల కొకసారి, ఒక conference రూపములో మీటుచేసి, వారివారి మధ్య నిర్వహించవలసిన కార్యక్రమములనుగురించి చర్చించుకోవలసిందిగా ప్రభుత్వము ఆదేశించింది కాని ప్రభుత్వము అనుకున్నంత ఫలితము ఉంటున్నదని నేను గట్టిగా చెప్పలేకపోతున్నాను.

మద్రాసు కార్పొరేషను చట్టప్రకారం యీ మునిసిపాలిటీలలో కూడా (United control in the hands of the Chief Executive Officer) కేంద్ర కృతాధిపత్యమును Chief Executive Officer చేతిలో ఉంచడం న్యాయమనే దృష్టితో ప్రభుత్వం ఆలోచిస్తున్నది. Integrated Municipal Act త్వరలోనే సభవారి ముందుకు వస్తుంది. అందులో అనేక విషయాలలో కొన్ని చిన్నచిన్న మార్పులు వస్తున్నాయి. కాని యిప్పుడు ఆ వివరాలన్నీ సభముందు పెట్టి కాలయాపనచేయు ఉద్దేశం లేదు. ముఖ్యమైన విషయం కాబట్టి సభవారికి మనవి చేస్తున్నాను. ఇక్కడ ఉన్న మాదిరిగా Octroi ని levy చేసుకోడానికి వీలు కలిగేటట్లుగా integrated Act లో ఏర్పరచాలనే ఉద్దేశం కూడా ప్రభుత్వానికి ఉన్నది. తరతరాలుగా ఆంధ్రప్రాంతంలోని మునిసిపల్ కౌన్సిల్సుకు ఇవ్వబడుతున్న Motor vehicle compensations ను 1956 వ సంవత్సరంలో ఆంధ్ర ప్రభుత్వం రద్దుచేసినది. దానిని గురించి అన్ని మునిసిపాలిటీలూ, ఏకగ్రీవంగా revise చేయాలంటున్నాయి. ఒక్కొక్క మునిసిపాలిటీకి 50 వేలు, 40 వేలు నష్టం వస్తున్నదనీ, అది భర్తీ చేసుకోవడం కష్టం కనుక అది ఉండాలనే కోరిక కలుగుతున్నది. Andhra Chamber of Commerceగాని, individual councils గాని పదేపదే తీర్మానాలు చేస్తున్నాయి. ఈ సంవత్సరపు బడ్జటులో దాని విషయమై ఏమీలేదు. వచ్చే సంవత్సరం బడ్జటులో అయినా ఏదో ఒక నిర్ణయం చేసుకోగలమని నేను ఆశిస్తున్నాను.

తెలంగాణాలోని మునిసిపాలిటీలకు సంబంధించి కొంతమంది ఎన్నికైన సభ్యులు, కొంతమంది nominated members కూడా ఉన్నారు. ఇది చాలా సంవత్సరాల క్రిందట జరిగిన వ్యవహారం. 3, 4, 5 ఏండ్లు దాటినవి కూడా తెలంగాణాలో ఉన్నాయి. అందువల్ల తెలంగాణాలో ఉన్నటువంటి Municipalities కు యీ సంవత్సరం ఎన్నికలు జరపాలని ప్రభుత్వాలోచనలో ఉన్నదని మనవిచేస్తున్నాను. మొన్నటి general discussion లో - అనుభవజ్ఞులు, ప్రభుత్వ కార్యకలాపాలను కొంతకాలం నిర్వహించిన పెద్దలు అయిన శ్రీ చెన్నారెడ్డిగారు ఏదో ఒక మున్సిపల్ కౌన్సిల్ విషయమై పేరుచెప్పి బెదిరిస్తున్నారు, అన్నారు. నాకు చాలా విచారం కలిగినది. ఆలోచించకుండా అట్లా అన్నారేమో అనుకున్నాను. ఏదో ఒక interested party యిచ్చిన సమాచారాన్నిబట్టి వారు యీ సభలో చెప్పడం అంత మంచిదికాదని మనవిచేస్తున్నాను. అయినప్పటికీ, వారు చెప్పినారు కాబట్టి బెదిరింపులు ఏమీ లేవని మనవిచేస్తున్నాను. అందులోనూ, ఊకదంపుళ్లపైగాని, వ్యర్థబెదిరింపులలోగాని యీ ప్రభుత్వానికి నమ్మకంలేదని మనవిచేస్తున్నాను. సహేతుకమైన కారణాలు ఉండి, నిబంధనలను అతిక్రమించి, ప్రజాధనం దుర్వినియోగపరిస్తే అవి ఏ మునిసిపాలిటీ అయినా తప్పకుండా కఠినచర్యలు తీసుకోవలసినదిగా సభవారు నన్ను ఆజ్ఞాపిస్తారని నేను ఆశిస్తున్నాను. ఈవిధంగా చక్కబెట్టుకోగలమేకాని, ఇతరులెవరో బెదిరించినంత మాత్రానగాని, interested testimony వల్ల గాని నిర్ణయాలుచేస్తే చాలా పొరపాటు అవుతుందని మనవిచేస్తున్నాను.

ఇప్పుడు మనకు హైదరాబాదు, సికిందరాబాదు అనే రెండు కార్పొరేషనులు ఉన్నాయి. ఈ రెండు కార్పొరేషనులూ మొదటినుంచీ వివిధరకాలుగా పెరిగాయి. హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ సాంప్రదాయం వేరు, సికిందరాబాద్ మునిసిపల్ కార్పోరేషన్ సాంప్రదాయం వేరు. మొదటినుంచీ యీ రెండూ పెరిగిన వాతావరణంకూడా వేరే. మనం Integration of Corporations Act తీసుకొని వచ్చినప్పుడు యీ హైదరాబాదు, సికిందరాబాదు కార్పోరేషనుల రెండింటినీ ఏకంచేసి ఒక పెద్ద సంస్థగా తయారుచేయాలనే ఉద్దేశం ఉన్నది. ఏదో ఒక sentiment కొరకు యీవిధంగా ఆలోచించడం లేదు. ఇందులో administrative efficiency, సాధ్యమైనంతవరకు expenditure ను తగ్గించడం, యింకా తదితర విషయాలుకూడా ఇమిడి ఉన్నాయి. దానితోబాటు, Cantonment area ను కూడా ఏదో defence establishment ఉన్న ప్రాంతాన్ని మినహాయించి - ఇందులో కలిపి 'Greater Hyderabad' అనో, 'Greater Secunderabad' అనో, 'భాగ్యనగర్' అనో, ఏపేరు పెట్టినాసరే - ఒక పెద్ద Corporation గా ఏర్పాటు చేసుకోవాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. దానివల్ల చాలా ఉపయోగాలున్నాయని ప్రభుత్వం

యొక్క సంకల్పం. Cantonment area ను యీ కార్పొరేషన్ క్రిందికి తీసుకు రావడానికి కేంద్ర ప్రభుత్వంతో సంప్రదింపులు చేయవలసివుంటుంది. అవసర మైనరీతిగా యీ ప్రభుత్వం యిప్పుడిప్పుడే కార్యకలాపాలు జరుపుతోంది. నాకు తెలిసినంతవరకూ దానినిగురించి సికిందరాబాదు ప్రాంతంలో కొంత అనుమానం, వ్యతిరేకత లేకపోలేదని మనవి చేస్తున్నాను. నిజంగా ఆలోచిస్తే వారి వ్యతిరేకత కొంచెము sentimental గానే ఉన్నట్లు తోస్తున్నది. Sentimentalities పైనగాని, sentimental objections పైనగాని మనం ఎవ్వరం ఆలోచించకూడదు. Administration లో efficiency పెంపొందించుకోడానికి, ఖర్చును తగ్గించుకోడానికీ మనం ఒక పెద్ద corporation ను ఏర్పాటుచేసికొని కేంద్ర ప్రభుత్వాన్నుంచి కార్పొరేషనుకు వచ్చే డబ్బుకు హైదరాబాదు ప్రాంతానికి మాత్రమే కాకుండా, సికిందరాబాదు, దాని పరిసర ప్రాంతాలకు కూడా ఉపయోగించుకోడానికి వీలుగా చేసుకోవాలని మనవి చేస్తున్నాను. ఈ క్రింది విషయం మన అందరికీ తెలుసును. Corporation కు కేవలం water supply and drainage కి 100 లక్షల రూపాయలు కేటాయించబడినది. Slum clearence మున్నగువాటికి 3 లక్షలపైగా జనాభా ఉంటేనేగాని ఆ కార్యక్రమం అమలు జరుపడానికి వీలు లేదన్నప్పుడు సికిందరాబాదు వంటి ప్రాంతం కూడా దాంట్లోనుంచి exclude కావడానికి అవకాశం ఉన్నది. "ఆ మాదిరిగా ఉండడానికి వీలులేదు. 50 వేల జనాభా ఉన్నప్పటికీ సరిపోతుంది. 50 వేల జనాభా ఉన్న ప్రాంతాలలో కూడా ఆ కార్యక్రమాన్ని అమలు జరవ డానికి వీలుండాలి" అని యీ ప్రభుత్వం చెప్పింది. ఈ విషయాలే, Local Bodies Ministers' conference లో తీర్మానం చేశాము.

హైదరాబాదు కార్పొరేషన్ జనసంఖ్య దాదాపు 11 లక్షల పైగా ఉన్నది. ఇంత పెద్ద జనసంఖ్య ఉన్నప్పటికీ ఆదాయాన్ని చూస్తే చాలా తక్కువని చెప్పవలసి వస్తుంది. ఇతర పెద్దపెద్ద కార్పొరేషన్సుతో పోల్చిచూచిన, ఆదాయం విషయంలో పోలిక ఉండడం లేదు. ఉదాహరణకు మద్రాసు కార్పొరేషన్ జన సంఖ్యకూడ దాదాపు 14 లక్షలు ఉన్నది. మూడుకోట్ల పైచిలుకు ఆదాయం ఉన్నది. 1956-57 లో 80 లక్షల చిల్లర ఆదాయం వచ్చినది. ఈ సంవత్సరం దాదాపు ఒక కోటి రూ॥ల వరకు ఆదాయం వచ్చినదని పత్రికలలో నేను ఇటీవల చూచాను. సికిందరాబాదు ఆదాయం 24, 25 లక్షలకు మధ్యగా ఉంటుంది. హైదరాబాదు, సికిందరాబాదు కలిసిన, మద్రాసు జనాభాకు మించ వచ్చు; లేక సమానం కావచ్చు. కాని ఆదాయంచూస్తే అక్కడి ఆదాయంలో సగంకూడా లేనట్లు ఖచ్చితంగా తెలుస్తున్నది. అందువల్ల ఈ కార్పొరేషన్సు యొక్క ఆదాయమును అభివృద్ధిచేసుకోవలసిన బాధ్యత ఆసంస్థలపైన ఎక్కువగా ఉన్నది. రాష్ట్రప్రభుత్వం వీలైనంతవరకూ సహాయం చేస్తూనే ఉన్నది. గత

సంవత్సరం హైదరాబాదు కార్పొరేషన్‌కు 17 లక్షల పైచిలుకు అనేక రంగాలలో అప్పుగా ఇచ్చినాము. ఇంతకంటే సహాయం చేయుటకు రానున్న రోజులలో రాష్ట్రప్రభుత్వానికి వీలు ఉండదనికూడా నేను మనవిచేస్తున్నాను. అందువల్ల ఈ కార్పొరేషన్సు వాటి ఆర్థికపరిస్థితిని అభివృద్ధి చేసుకోవలసి ఉంటుంది. ఈ సందర్భంలోనే గౌరవనీయ మాజీ మంత్రి ఎక్బోటేగారు మాట్లాడుతూ interference in the Local Bodies అని ఒక విసురు విసిరినారు. హైదరాబాదు కార్పొరేషన్ వ్యవహారాలను విచారించి, తనిఖీచేసి ప్రభుత్వానికి, కార్పొరేషన్‌కు కూడా సూచనలు ఇవ్వవలసిందని రాష్ట్రప్రభుత్వం ఈ విషయంలో ఎక్కువ అనుభవం గడించిన మన ప్రస్తుత ప్లానింగు సెక్రటరి సి. నరసింహంగారిని నియమించింది. ఈయన అనేక స్థానికసంస్థలలో, మున్సిపాలిటీలలో కమిషనర్‌గా పనిచేసినవారు. అంతేగాక మద్రాసులో దాదాపు 4, 5 సంవత్సరాలపాటు ఈ చట్టమును అమలుపరచి ఎక్కువ అనుభవమును పొందినవారు. అందువల్ల ఈ వ్యవహారాలను కొంచెం చూడవలసిందని ఎంత వరకు బాగుచేయుటకు వీలుంటుందో తెలియజేయమని సదుద్దేశంతోనే ఆయనను నియామకం చేయడం జరిగింది. ఈ నియామకం ఒక్కరోజున అకస్మాత్తుగా మంత్రిగారు ఆలోచించి చేసినట్టిదికాదు. పదిలక్షల పైచిల్లర డబ్బును కార్పొరేషన్‌కు అప్పుగా ఇచ్చునప్పుడు కొన్ని నిబంధనలను పెట్టినాము. అందులో ముఖ్యమైన నిబంధన ప్రభుత్వంతరపున ఒక ఉద్యోగి వచ్చి కార్పొరేషన్ వ్యవహారములు తనిఖీ చేసి, అభివృద్ధి చెందుటకు సూచనలు చేయుటకు ఒప్పుకోవాలని ఉన్నది. కార్పొరేషను ఆ కండిషన్‌కు ఒప్పుకొని ఆ డబ్బును ప్రభుత్వంనుండి తీసుకొన్నది. ఆ కారణంచేతనే ఒక ప్రత్యేక ఉద్యోగిని అన్ని కార్యకలాపములను చూచి ఉభయులు సంప్రదించుకొని ఇంకా ఆదాయము ఎక్కువచేయుటకు మార్గాలను సూచించవలసిందిగా నియమించినాము. అంతేకాని రంధ్రాన్వేషణకుగాని లేక హైదరాబాదు కార్పొరేషన్ చాలా చెడ్డదిగా ఉన్నదనిగాని, దానిపైన ఎక్కువ complaints వస్తున్నవనిగాని, దానిపై విచారణ జరపాలనిగాని మా ఉద్దేశం కాదు. అధ్యక్షా! కొంతమంది సభ్యులు అపోహపడి, వారిపైన enquiry చేస్తున్నారని నా దగ్గరకు deputation వచ్చినారు. నేను వారితో ఉన్న వాస్తవ విషయాలను మనవి చేసినాను. File లో ఉన్న ఆర్డరునుకూడా చూపించాను. వారు సంతృప్తిచెంది వెళ్ళినారు. కాని మరల తెరచాటున నాటకం జరిగినట్లు ఉన్నది. ఒక తీర్మానం చేశారు. వారు తీర్మానం చేసినందుకు నే నేమీ వేరే అనుకోవడంలేదు. కాని వాస్తవిక పరిస్థితులు ఎక్బోటేగారికి గాని, తదితర మిత్రులకుగాని తెలిపిన మంచిదని, వారి అభిప్రాయాలు మార్చుకొనుటకు అవకాశం ఉంటుందనే ఉద్దేశంతో మనవిచేస్తున్నాను. కేవలం లోకల్‌బాడీస్‌లో interfere కావాలనే

పూర్వం అలాంటి అలవాటులు ఉన్నవేమోగాని నాకు సంబంధించినంతవరకు అలాంటి ఉద్దేశం లేదని మనవిచేయుచున్నాను.

తరువాత అన్నింటికన్న ముఖ్యమైన విషయం స్థానిక సంస్థలు. పంచాయితీలను ఎక్కువగా ఏర్పరచాలి. మన రాజ్యాంగ చట్టంలోకూడ ప్రతి గ్రామానికి విధిగా ఒక పంచాయితీని ఏర్పాటుచేయాలని ఉన్నది. వాటికి అధికారాలు, బాధ్యతలు, ఆర్థికస్తోమతు అన్నింటిని సక్రమంగా సమకూర్చితేనే వారు ఎక్కువగా రానున్న రోజులలో అభివృద్ధి కార్యక్రమాలలో, ఇంకా ఇతర కార్యక్రమాలలో జోక్యం కలిగించుకొని ఎక్కువ శ్రద్ధవహించి పని చేయుదురు. అప్పుడే మన ఆశయం నెరవేరుతుంది అనే నమ్మకం నాకేకాదు; సభ్యులందరికీ ఉన్నదని మనవిచేస్తున్నాను. ఇదివరకు ఎలా ఉన్నప్పటికీ ఇప్పుడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అవిషయాన్ని బాగా గుర్తించి ఈ స్థానికసంస్థలను, ముఖ్యంగా ఈ పంచాయితీలను బలీయమైన సంస్థలుగా ఏర్పరచాలనే సంకల్పంతో ఉన్నాయి. అందువల్లనే పంచాయితీలను చురుకుగానే ఏర్పాటు చేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినంతవరకు అడ్డంకులు ఏమీలేవు. ఇందుకు ఒక పంచాయితీ ఆఫీసరును, ఒక డిప్యూటీ పంచాయితీ ఆఫీసరును, ఒక రీజనల్ ఇన్‌స్పెక్టరును, ఈ ముగ్గురూ ఈ కార్యక్రమములో ఉన్నప్పటికీ కొంత జాప్యం జరుగుతున్నది. అందువల్ల ఇంకొక మెట్టు తగ్గించి రీజనల్ ఇన్‌స్పెక్టరు దగ్గరకు రావలసిన అవసరంలేదని ఏర్పాటు చేసినాము. ఇందువల్ల శీఘ్రంగా ఏర్పరుచుటకు వీలౌతుంది. తెలంగాణ ప్రాంతానికి సంబంధించినంతవరకు ఇదివరకు చట్టం ప్రకారం కొన్ని ఇబ్బందులు, కొంత ఆలస్యం జరుగుతున్నది. దానికి పోయిన Act క్రింద రూల్సు చేయకపోవడం ముఖ్యకారణం. ఈ రూల్సు కూడా ఇప్పుడు తయారైపోయాయి. బహుశః కొద్దిరోజులలోనే నోటిఫై చేయడం జరుగుతుంది. ఆ తర్వాత చురుకుగా కార్యక్రమము కొనసాగించుటకు వీలుంటుందని మనవిచేస్తున్నాను, ఇప్పుడు పంచాయితీలు ఎక్కువ ప్రాముఖ్యత వహిస్తున్నందున Madras Panchayat Act 1950; Hyderabad Village Panchayat Act 1956, ఈ రెంటిని integrate చేసి, దానిని వచ్చే అసెంబ్లీలో ప్రవేశపెట్టాలని నేను సంకల్పించాను. దానికి కార్యకలాపాలు జరుగుతున్నవి. Law Department లోని ప్రత్యేకఉద్యోగి examine చేయడం, కొన్ని నిర్ణయాలు తీసుకోవడం జరిగింది. కాలయాపన జరుగకుండా రెండు మాసాలలోనే దీనిని పూర్తిచేయాలని మా సంకల్పం.

ఆంధ్రప్రాంతములో class I పంచాయితీలు 215 వున్నవి. Class II పంచాయితీలు 9,038 వున్నవి. తెలంగాణాలో మొత్తం 1,260 పైచిల్లర వున్నవి. అన్నిరకముల ఆదాయముకలిపి మొత్తము ఆంధ్రప్రాంతములో

పంచాయితీలకు రు 1,86,00,000 లు వస్తున్నది. తెలంగాణాలో 10,88,000 పైచిల్లర ఆదాయము వస్తున్నది. ఆంధ్రలో తారు, కాంక్రీట్, సిమెంటు రోడ్లు అన్నీకలిపి 12,330 మైళ్ళ పైచిలుకు రోడ్లు వారు నిర్వహిస్తున్నారు. తెలంగాణాలో 109 మైళ్ళ రోడ్లు, ఇంకా 198 ఎలిమెంటరీపాఠశాలలు, రీడింగ్ రూమ్స్, లైబ్రరీలువున్నవి. లోకల్ డెవలప్మెంటు కమ్యూనిటీ డెవలప్మెంట్ కార్యక్రమములలో ఈ పంచాయితీలు 25 లక్షల వాటాతో భాగస్వాములై రు. 82 లక్షలకు పనులను నిర్వహిస్తున్నది. మద్రాసు పంచాయితి యాక్టు 1950 సదుద్దేశ్యముతోనే పంచాయితీలను అభివృద్ధిచేయాలనే అభిప్రాయంతోనే చేయ బడినది. ఆనాడు ఆ యాక్టుయొక్క సెలక్టుకమిటీలో వుండే అవకాశము నాకు కల్గింది. కాని కార్యనిర్వహణకు కొన్ని ఆటంకములు కలుగుతున్నవి. ముఖ్యంగా రెవెన్యూసైడునుండి ఎక్కువ ఆటంకములు కల్గుతున్నాయని అనుభవమువల్ల తెలుస్తున్నది. పంచాయితీలు, జిల్లా సంఘాలు, తాలూకా సంఘములు మెమోరాండములద్వారా, తీర్మానములద్వారా వాటి ఇబ్బందులను తెలియ చేసినవి. ఆ **deficit** ను **remove** చేసి, రానున్న రోజులలో పంచాయితీల భవి ష్యత్తును దృష్టిలో పెట్టుకొని. మన ఉద్దేశ్యాలకు అనుగుణంగా సక్రమపద్ధతిలో ఈ యాక్టును తయారుచేస్తున్నామని నేను ఇదివరకే మనవిచేశాను. ఈ పంచా యితీలను 600, 500 గ్రామాలకు ఏర్పాటుచేస్తే ఉపయోగములేదని, **not financially viable** అనే ఇబ్బందులు వస్తున్నవి. 2000 జనాభా గల ప్రదేశాలలో ఈ సంస్థలను ఏర్పాటుచేస్తే అక్కడ కార్యక్రమములు బాగా జరగటానికి వీలుంటుందని ఒక నిర్ణయానికి వచ్చాము. లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ మంత్రుల కాన్ఫరెన్సులో ఈ విషయం చర్చకు వచ్చింది. వారుకూడా ఈ అభిప్రాయమునే బలపరిచారు.

కాలపరిమితిని పొడిగించే విషయాన్నిగురించి కొంత చెప్పవలసి వుంది. ఈ కాలపరిమితిని 5 సంవత్సరాలు చేస్తే తప్ప plan లోని పని జరుగదు. ప్రతి మూడు సంవత్సరములకు ఎన్నికలు జరపటం, వాటికి డబ్బును ఖర్చుపెట్టటం కూడా ప్రభుత్వమునకు కష్టము. అదీగాక 10, 15 వేల సంస్థలకు ఎన్నికలు జరపటానికి సంవత్సరాలకాలం పడుతుంది. 56 లో ఎన్నికలు ప్రారంభించినా అనేక కారణాలవల్ల హైకోర్టు ఒత్తిడివల్లకాని, మరే కారణంవల్లకాని యింకా 30, 40 పంచాయితీల ఎన్నికలు మిగిలిపోయాయి. ఆ మిగిలిన పంచాయితీ లలో అంతా చదువుకొన్నవారు, లేకపోయినా కొందరు అనుభవజ్ఞులు ఎలాగూ వుంటారు కనుక ప్లానింగ్ కార్యక్రమములను సక్రమముగా నిర్వ హించటానికి కొంత వ్యవధిఇస్తే బాగుంటుందని, వారి కాలపరిమితిని పెంచితే బాగుంటుందని నిర్ణయించాము. ఆంధ్రలో దాదాపు 70 వేల పైచిలుకు పంచాయితీ సభ్యులు వుంటారు. వారు ప్రజల విశ్వాసమును పొందినవారు,

వారిద్వారా ప్లాను సక్రమపద్ధతిలో ముందుకుపోవచ్చునని, చురుకుగా, చక్కగ నడవగలదనే ఆశ ప్రభుత్వమునకు వున్నది. అందుచేత పంచాయితి అధ్యక్షులకు, సభ్యులకు కొంత ట్రెయినింగ్ ఇస్తే బాగుంటుందనే ఆలోచన ప్రభుత్వానికి వుంది. కాని ప్రస్తుతానికి ఈ సంవత్సరములో ఈ ట్రెయినింగ్ నిమిత్తం ఎక్కువ మొత్తమును కేటాయించటానికి వీలులేకపోయింది. బ్లాక్ కౌన్సిల్స్ ఏర్పాటుచేసినప్పుడు, అక్కడకు వచ్చే పంచాయితీ అధ్యక్షులను, సభ్యులకు యింకా నాల్గురోజులు అక్కడేవుంచి పంచాయితీల ఎడ్మినిస్ట్రేషన్ గురించి, ప్లానింగ్ కార్యక్రమములగురించి కొన్ని విషయాలు చెప్పటం అవసర మని భావించి ప్రభుత్వము ఆ ప్రయత్నమును చేస్తున్నది.

మరొక ముఖ్యమైన విషయం. ఇందులో ప్రభుత్వము యింకా ఒక నిర్ణయమునకు రాలేదుకాని యింకా ఆలోచనలోనే వుంది. సివిల్, క్రిమినల్ విషయాలలో వీరికి ఎక్కువ అధికారములు ఇస్తే బాగుంటుందేమో అనే ఆలోచన ప్రభుత్వానికి వుంది. ఈ నాడు అధ్యక్షస్థానములో వున్న మీరు ప్లీడరు పనిని చేసినవారే. నేను కొంతకాలం ప్లీడరుగా పనిచేసి వున్నాను. నా స్వానుభవం వల్ల కొన్ని గ్రామవిషయాలు నాకు తెలుసును. గ్రామాలలో ఏవో చిన్నచిన్న తగాదాలు రావటం సాధారణముగా జరుగుతూనే వుంటవి. ఆ కోపంలో వారు కోర్టులకు పోవటం, దావాలు, కేసులు వేసుకోవటం తరువాత వారు అలా ఎందుకు చేశామా అని పశ్చాత్తాప పడటం జరుగుతుంది. అటువంటి అనుభవాలను దృష్టిలోపెట్టుకొని ఆ సివిల్ క్రిమినల్ పరిస్థితులను గమనించి, అటువంటివాటిపై వాటికి ఎక్కువ అధికారములు ఇస్తే చిన్న కేసులను పరిష్కరించటం సాధ్యం అవుతుందని ప్రభుత్వం భావిస్తున్నది. 5, 6 గ్రామా లను గ్రూపుగా ఏర్పరచి, ఆ అధ్యక్షులతో పంచాయితి కోర్టులను నిర్వహింప చేయాలనే ఆలోచనవుంది. **Integrated Act** వచ్చినపుడు గౌరవ సభ్యులందరు ఈ విషయమును దృష్టిలో వుంచుకొని తమ అభిప్రాయములను తెలియజేయా లని మీ ద్వారా వారికి మనవిచేస్తున్నాను.

పోరంబోకులు, పాండ్స్, టాంక్స్ మొదలైనవాటిపై వచ్చే ఆదా యాన్ని పంచాయితీలకు ఇవ్వాలనే విషయం వుంది.

ఈ మధ్యనే ఒక ప్రశ్నకు జవాబు చెబుతూ పంచాయితీ జర్నలు ఏర్పాటుచేయాలని, తద్వారా పంచాయితీ అధ్యక్షులకు, సభ్యులకే గాకుండా చిన్న చిన్న అధికారులకుకూడ యేమిచేయాలో, దాని కార్యక్రమాలు యేమిటో, తెలిసేటట్లు చేయాలని నిర్ణయం జరిగింది. బహుశా ఈపాటికి వచ్చే ఉండవచ్చు. లేకపోతే కొద్ది రోజులలో వెలువడుతుంది. ఇంకొక ముఖ్యమైన విషయం, కొన్ని గ్రామాదులను కలిపి ఒక గ్రూపుగాచేసి, ఒక గ్రూపుకు

అసిస్టెంటును వేయాలని, ఒక సెక్రటరీ హోదాలో పనిచేసేటట్లు అతనికి అధికారంయిస్తే బాగుంటుందని అనుకొన్నాం. ఎన్నిక అయిన అధ్యక్షునికి నేరుగా పన్నులు వసూలుచేసే బాధ్యత యివ్వడం అంత మంచిదికాదని అభిప్రాయానికివచ్చి కొన్ని సెలక్టు కేంద్రాలలో experimental గా చేస్తున్నాం. ఆగ్రూపు అసిస్టెంటులచేత వసూలు చేయిస్తే ఎలాగ ఉంటుందో అని experiment చేస్తున్నాము. రెండు మూడు మాసాలు అయిన తరువాత దీని ఫలితాలు దృష్టిలో పెట్టుకొని, కొన్ని నిర్ణయాలు తీసుకొంటుంది ప్రభుత్వం!

ఆంధ్ర ప్రాంతంలో మాదిరిగానే ఎన్నికైన సభ్యురాండ్రుగాక కోఆప్టు చేసుకొనే పద్ధతిని ఒక్కొక్క పంచాయితీకి ఒక్కొక్క సభ్యురాలను వేసుకొంటే బాగుంటుందని తలచాను. దీనిప్రకారం 9 వేల పైచిల్లర మంది పాల్గొనే అవకాశం కల్గింది. అంతేకాకుండా కొన్నిచోట్ల అధ్యక్షురాండ్రుగా, ఉపాధ్యక్షులుగా ఎన్నికైన సందర్భాలు ఉన్నాయి. కేవలం స్త్రీలే ఉన్న పంచాయితీలు కూడ ఉన్నాయి, ఒక్క మగవాడు అనేవాడు లేకుండా! తెలంగాణాలో కూడ ఈపద్ధతి తీసుకొనిరావలెనని నిర్ణయించడం జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో భూమి శిస్తులో కొంత శాతాన్ని పంచాయితీలకు యివ్వాలని, చట్టంలో ఉంది. కాని యెప్పుడూ యివ్వడం జరుగలేదు. అది dead letter గా ఉండడం.యెందుకని 1950 సంవత్సరంలో కర్నూలులో ఉన్నప్పుడు దానిని తొలగించివేశాము. ఇక్కడ land revenue లో 15% యివ్వాలని చట్టంలో ఉన్నది. దానిప్రకారం యిస్తూనే ఉన్నారు. ఇది అందరికి తెలిసే ఉండవచ్చు. బల్వంతరాయ్ కమిటీ రికమెండేషన్స్ ప్రకారం, బ్లాక్ కౌన్సిల్ కు ల్యాండు రెవిన్యూలో నూటికి 50% ఏర్పాటు చేయాలని సిపారసు చేశారు. అది ఎంతవరకు కేంద్ర ప్రభుత్వం అంగీకరిస్తారో తెలియదు. అయిచ్చేటటువంటి డబ్బును రాష్ట్ర ప్రభుత్వాలను యివ్వమంటే, అట్లా యిచ్చేటటువంటిపరిస్థితిలో రాష్ట్ర ప్రభుత్వాలుమాత్రం లేవు. అది నూటికి ఎంత శాతము అయినప్పటికీ కానీయండి, ఏమాత్రం యివ్వలేదు. తరువాత పంచాయితీలు రెవిన్యూను వసూలు చేయకూడదా అన్న ప్రశ్న వస్తున్నది. ఇప్పుడు ఉన్నటువంటి పరిస్థితులలో మంచిది కాదేమో అనిపిస్తున్నది. కొన్నాళ్ళు అయినతరువాత, బహుశ మూడవప్లాను వచ్చేసరికి అది అమలులోకి వస్తుందేమో చెప్పలేను. ఏమైనా యిప్పుడు ప్రభుత్వం ఆ నిర్ణయాన్ని చేయదలచుకోలేదు. ఇంతవరకు ప్రభుత్వం యిచ్చినటువంటి డియర్నెస్ అలవెన్సు వగైరాలు అన్ని లోకల్ బాడీస్ లో ఉన్నటువంటి ఉద్యోగస్తులకు అన్వయింప చేశాము. కాని ఒక్క విచారకరమైన విషయం. స్కావింజర్సు, స్వీపర్సు, రోడ్డు మేస్త్రీలు మొదలైనవారు కంటింజెన్సీ ఎస్టాబ్లిష్ మెంటులో ఉన్నటువంటివారికి, కేంద్ర ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం యివ్వడానికి వీలులేకుండా ఉన్నది. ఈ విషయ

ములో గత 9 మాసాలుగా కేంద్రప్రభుత్వానికి రిప్రజెంటు చేస్తూవచ్చాము. కాబట్టి ఆ విషయం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఆలోచనలలో ఉన్నదని మనవి చేస్తున్నాను. పంచాయితీలగురించి వాటికి డిస్క్రిషనరీ గ్రాంట్సుగా ఐ. జి. కి నాలుగు లక్షలు యిచ్చాము. జిల్లాబోర్డులకు ఈ 58-59 లో 25 లక్షలు కేటాయించాము. ఈ విధముగా ఉన్నంతవరకు ప్రభుత్వం సహాయపడుతూనే ఉంది. వివిధ రంగాలలో ఉన్నటువంటి విషయాలను యెక్కువగా సమాచార పూర్వకంగా సభ్యులందరికి మనవిచేశాను. వారి సూచనలకై ఎదురు చూస్తున్నాను.

శ్రీ జె. ఆనందరావు: తెలంగాణాలో 15% రెవిన్యూ పంచాయితీలకు యిస్తున్నాం అని చెప్పారు. అది చట్టంలో మాత్రమేఉంది. ఆచరణలో లేదని విజ్ఞప్తి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్: అది తీసివేశామని అన్నారుకదా!

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి: ఆంధ్రలో తీసివేశాము. తెలంగాణాలో యిస్తున్నాం. ఆ విషయమై నేను facts and figures తో తరువాత మనవి చేస్తాను.

శ్రీ బి. శంకరయ్య: "లోకల్ బాడీస్‌కు ఈ సంవత్సరం ప్రత్యేక డిమాండు ఏర్పాటు చేశాము" అన్నారు. లోకల్ బాడీస్‌కు వేసిన పద్దులో ఒక్కదానికేగాక, మిసలేనియస్‌నుకూడ చేర్చారు. రెండిటినికలిపి ఒకదానిగా యెందుకు వేశారో తెలుపుతారా?

మిస్టర్ స్పీకర్: Cut motions వచ్చినప్పుడు సావకాశంగా మాట్లాడు కోవచ్చు. మూడు, నాలుగు గంటలు ఉంటాయి. ఇప్పుడు యిక కుదరదు.

ఇప్పుడు గౌరవ మంత్రిగారు 36వ డిమాండును లోకల్ అడ్మినిస్ట్రేషన్‌కు రూ. 46,96,400 కోరారు. దీనిమీద cut motions ఉన్నాయి.

శ్రీ గోపిడి గంగారెడ్డి: On a point of order, Sir! మీరు నిలబడి ఉండగా వారు రావచ్చునా?

మిస్టర్ స్పీకర్: నిలబడినప్పుడు రాకూడదని లేదు అనుకొంటాను. అయినా చూచిచెబుతాను. ఎందుకంటే చాలా సేపు చదువుచున్నప్పుడు రాకూడదులంటే practical గా చాలాకష్టం.

శ్రీ పి. సుందరయ్య: మీరు ఆవిధంగా మాట్లాడుతూంటే యింకో మంత్రిగారు లేచిపోతున్నారు.

మిస్టర్ స్పీకర్ : అసలు మంత్రిగారే లేచిపోతున్నారు. యింకో మంత్రి గారిని acting చేయమని కోరి ఉంటారు.

శ్రీ పి. సుందరయ్య : మీరు నిలబడినప్పుడు, శాసనసభలో ఇంకయెవ్వరూ నిలబడకూడదని రూలు ఉంది. అది సాంప్రదాయము.

*Mr. Speaker :* I think so.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం-జనరల్) : అధ్యక్షా, మీరు మాట్లాడు తున్నప్పుడు వారు నిలబడవచ్చునా ?

శ్రీ పి. సుందరయ్య : వారు ఎందుకు నిలబడ్డారు, మీరు నిలబడినప్పుడు? ఇది మూడవ తప్పు. అధ్యక్షా ! మేము objection raise చేస్తున్నప్పుడు వింటూ వింటూ లేచిపోవడం మరీ అన్యాయంగా ఉంది.

*Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli)* : Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To criticise the Government in contemplating the abolition of District Boards.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To impress upon the Government to introduce District Councils with power on all departments in the District and of the District Boards with elected Chairman.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To criticise the Government policy in not granting the grants to the District Board for the year shown in the Educational Grant.)

*Sri Gopidi Ganga Reddi (Mudhole)* : Mr. Speaker, Sir, I beg to move ;

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(టోలు గేట్లు ఆపుదల అనగా రద్దు చేయకనే టాక్సులు వేసినందులకు.)

*Sri Baswa Maniah (Andole)* : Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(తెలంగాణాలో టోలుపన్ను తీయక కచ్చాయిరోడ్డు బాగుచేయించక పన్నులు పెంచు విధానమును విమర్శింపగలందులకు.)

*Sri K. Muthyam Reddy (Nirmal):* Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(పురపాలక సంఘాలకు పన్నులు చెల్లించి తర్వాత, ప్రతిచోట టోలు టాక్సులు వసూలుచేసే పద్ధతి తెల్పనందుకు)

*Sri Gopidi Ganga Reddy :* Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(గ్రామపంచాయితీలకు లాండు రెవిన్యూ నుంచి 15 శాతము కేటాయించి యివ్వనందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(టౌను కమిటీలు మరియు మున్సిపల్ కమిటీలు చట్టప్రకారము రద్దు చేయనందులకు.)

*Sri Baswa Maniah*: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జోగిపేట టౌను కమిటీలో రు. 40,000 డబ్బు యున్నను సంవత్సరాలనుండి డ్రైనేజ్ సమస్యను ఆపినందుకు ప్రభుత్వ విధానమును విమర్శించేందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జోగిపేట టౌను కమిటీకి ఫర్నిచరు గురించి 5 సంవత్సరాలనుండి వ్రాసినను సప్లయి చేయలేని ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జోగిపేట పురపాలక సంఘమునకు సంవత్సరములనుండి డస్ట్‌బిన్సు సప్లయి చేయనందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

జోగిపేట ఔను కమిటీద్వారా కేంద్రప్రభుత్వముచే నొసంగబడు డబ్బుచే యింతవరకు డాంబరురోడ్లు గ్రామములో వేయించనందుకు.)

*Sri Pillamarri Venkateswarlu*: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To discuss the failure of the Government to reconstitute District Boards with elected representatives.)

*Sri S. Vemayya* (*Buchirddipalem - Reserved*): Mr. Speaker, Sir. I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(ప్రొద్దుటూరు మునిసిపల్ ఉద్యోగుల నిర్లక్ష్య పక్షపాత చర్యలను ప్రభుత్వము అరికట్టనందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(అల్లూరు, బుచ్చిరెడ్డిపాలెం క్లాస్ 1 పంచాయితీలలో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకోకుండా పరిపాలన సక్రమంగా సాగడానికి వీలులేకుండా చేసినందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(మానెగుంటపాడు పంచాయితీలో వున్న 1. మానెగుంటపాడు, 2. రామన్నపాలెం. 3. అర్లపాడు రెవెన్యూ గ్రామాలను విడగొట్టి ఆ మూడు గ్రామాలకు వేరువేరుగా పంచాయితీలను స్థాపించమని ఏకగ్రీవంగా. మానెగుంటపాడు పంచాయితీ తీర్మానించినప్పటికీ యింతవరకు వారు కోరినవిధంగా 1. మానెగుంటపాడు. 2. రామన్నపాలెం 3. అర్లపాడు గ్రామాలకు పంచాయితీలను స్థాపించనందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు పురపాలక సంస్థలో చేరిన చెట్టుగుంటరోడ్డు ఉత్తరముగానున్న హరిజనులకు కాలవదాటుటకు వంతెన ఏర్పాటు చేయకున్నందుకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు పురపాలక సంఘము సరిహద్దులలోనున్న నరుకూరుచేటువద్ద కుసుమ హరిజనపాలెం హరిజనులకు గృహావసతి ఏర్పాటు చేయుటలో జాప్యం జరుగుచున్నందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు పురపాలక సంఘ సరిహద్దులలోనున్న ముత్యాలపాలెం గ్రామ హరిజనులకు ఇండ్లస్థలములకు యిచ్చియున్న అప్పు రద్దు చేయనందులకు.)

To reduce the allotment of Rs. 46,96 400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు మునిసిపల్ కమిషనర్ వారు గవర్నమెంటు లెటర్ నెం. 273112-56-57 ఆరోగ్యము-తే. 7-8-56 ది. మేరకు పిండిమిల్లుల మీద ఏమిచర్య తీసుకొన్నది యింతవరకు తెలుపనందుకు.)

*Sri Gopidi Ganga Reddy*: Mr. Speaker, Sir. I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నిర్మల్‌లో పురపాలక సంఘానికి స్లమ్ క్లియరెన్సు కొరకు తగిన ధన సహాయము చేయలేనందులకు.)

*Sri Baswa Maniah*: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(కేంద్రప్రభుత్వ సలహా ప్రకారము జోగిపేట పురపాలకసంఘము 4 పాకీదొడ్లు కట్ట నిర్ణయించినను ప్రభుత్వము ఆజ్ఞ యివ్వకపోవు విధానము విమర్శించగలందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జోగిపేట పురపాలక సంఘము పశు విక్రయ సుంకము విధించదలచి నను ప్రభుత్వము ఆజ్ఞ నొసంగని విధానమును విమర్శించగలందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(టౌను ప్లానింగు గురించి 7 సం.ల నుండి జోగిపేట పురపాలకసంఘము కృషి చేయుచున్నను ప్రభుత్వము మూకీభవించు విధానమును ఖండించ గలందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జోగిపేట టౌను కమిటీలో రు. 40,000 డబ్బు యుండి వాటర్ సప్లయి గురించి 5 సం. ల నుండి కోరినను ప్రభుత్వం చేయనందులకు.)

*Sri S. V. K. Prasad (Chennur)*: Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(వరంగల్ జిల్లాలో పంచాయితీల స్థాపన ముఖ్యంగా గత 2 సం. లలో ఏమీ చేయనందుకు విమర్శించుటకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పంచాయితీ చట్టం ప్రకారం వారికివ్వవలసిన రెవెన్యూ భాగాన్ని యివ్వకపోవటాన్ని విమర్శించుటకు.)

*Sri Banappa (Makthal-General)*: Mr. Speaker, Sir, I beg to move.

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(స్థానిక స్వపరిపాలన సక్రమముగా జరుగుటకు అవసర చర్యలు తీసుకోనందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పంచాయతీ గ్రామములపై తగు శ్రద్ధ వహించనందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(ఆంధ్ర తెలంగాణాలలోగల పంచాయితీ ఆక్టులను నేటివరకు సమన్వయ పరచి ఒక నిర్దిష్టమయిన శాసనమును చేయుటలో విఫలమయినందులకు.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జిల్లా బోర్డుల కార్యక్రమము బాగులేనందున.)

*Sri R. C. Obula Reddi (Proddutur)*: Mr. Speaker, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

ప్రొద్దుటూరు మునిసిపాలిటీలోని అవకతవకలను అసమర్థతను ప్రభుత్వ దృష్టికి తెచ్చుటకు.

*Sri D. Narasiah* (*Huzurnagar*) : Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జిల్లా బోర్డులకు ఎన్నికలు జరుప నిరాకరించుతున్నందులకు.)

To reducc the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(గ్రామ పంచాయితీలకు నిధులను సమకూర్చుటలోనూ, వాటి బడ్జెట్ లను మంజూరు చేయుటలోనూ వాటి ప్రణాళికలను ఆమోదించకపోవడం మొదలగు ప్రజాతంత్ర వ్యతిరేక పద్ధతులు అనుసరిస్తున్నందులకు.)

*Sri B. Dharmabhikśham* (*Nakrekal*) : Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పంచాయితీ కమిటీలకు ప్రచారశాఖనుండి ఆంధ్రప్రదేశ్ సమాచార పత్రిక, గెజిట్సు పంపించు ఏర్పాట్ల గురించి చర్చించుటకుగాను.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పంచాయితికమిటీలకు సంబంధించిన ప్లానింగుశాఖ సూచనలను, ఆర్డర్సు గైడెన్సును పంచాయితీ కమిటీలకు అందించకపోవడం గురించి చర్చించుటకు గాను.)

*Sri B. Sriramamurthy* (*Vizianagaram*): Mr. Speaker, Sir, I beg to move:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To discuss the failure of the Govt. to establish District Councils duly elected by the people on adult franchise, for the purpose of running the administration at the District level and also with a power to spend plan money and exercise control and power over police.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To discuss the failure of the Government to allot ¼th of the Land Revenue to Village Panchayats.)

*Sri P. Narasinga Rao* : Mr, Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

For not holding elections in Local Bodies where their terms (ended.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(For not giving adequate representation to all the parties in the nomination of district boards in Telangana.)

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs· 100

(For not sanctioning grants to Panchayats Committees in time.)

*Sri B. Dharma Bhiksham* ; Mr. Speaker, Sir, I beg to move :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Adminstration by Rs. 100

(నల్లగొండ జిల్లాబోర్డులో నిల్వ వున్న ధనాన్ని ప్రాథమిక పాఠశాలల భవనాలను జిల్లాలోని కొన్ని చిన్న రోడ్ల నిర్మాణానికి ఉపయోగించకపోవడం గురించి చర్చించుటకు గాను.)

*Mr. Speaker* : All these cut motions are now before the House.

* శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు: అధ్యక్షా, Cut motions ను move చేసిన తరువాత, వాటిపైన debate ను ప్రారంభించవలసినది ప్రభుత్వపక్షం, ప్రభుత్వ పక్షాన్ని బలపర్చేవారు కాదు. Cutmotions ఇచ్చి వాటిని move చేసింది ప్రతి పక్షం. కాబట్టి debate ను open చేసే అధికారం ప్రతిపక్షానిది. దానిని బలపర్చే వారిదీని. ప్రతిపక్షంనుంచి మాట్లాడేవారికి మీరు ఒక నిమిషమో లేక అర నిమిషమో ఇవ్వండి; అది వేరేసంగతి. వారికి కావలసి ఉంటే కాంగ్రెస్ వారి time అంతా యివ్వండి నాకేమీ ఆక్షేపణలేదు. ఈ debate ను start చేసే హక్కు ప్రతిపక్షానిదేనని మీ దృష్టికి తీసుకు వస్తున్నాను. కాబట్టి ఈ విషయంపై రూలింగు యివ్వమని కోరుతున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు: అధ్యక్షా ! ముందు మాట్లాడాలని మేము చెప్పలేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : మంచిది. అయితే బుద్ధిమంతులు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : వారిదగ్గరనుంచి బుద్ధి నేర్చుకోకపోతే ఎట్లా ?

మిస్టర్ స్పీకర్ : Cut motions move చేసిన తరువాత debate ను start చేసే హక్కు ప్రతిపక్షానికే ఉంది. కానీ నేషనలిస్టుపార్టీ ప్రతిపక్షం కాదని ఎంచడానికివీల్లేదు. కాంగ్రెస్ పక్షానికి మిత్రులుకానివా రందరు ప్రతి పక్షంవారే. నేషనలిస్టు పార్టీలోని కొందరు తాము కాంగ్రెస్‌పక్షాన్ని బలపరుస్తున్నామని చెప్పవచ్చు, కొందరు దానితో ఏకీభవించక పోవచ్చు. కాబట్టి నేషనలిస్టుపార్టీ, సోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టుపార్టీ, వావిలాల గోపాల కృష్ణయ్యగారి పార్టీ ఈ నాలుగూ ప్రతిపక్షాలే. అందువల్ల Technical గా ఏమీలేదు. General గా పెద్ద ప్రతిపక్షం, నిజమైన ప్రతిపక్షం కమ్యూనిస్టు పార్టీయే. తరువాత సోషలిస్టులు వస్తారు. ప్రతి విషయంలోను నేషనలిస్టులు ప్రభుత్వాన్ని బలపర్చడంలేదు. అందులో ప్రభుత్వానికి అనుకూలంగా ఓటుచేసే వారు, ఓటు చెయ్యనివారు కూడా ఉన్నారు. అందుచేత నేషనలిస్టు పార్టీ ప్రతిపక్షంక్రిందే లెక్క. అందుచేత నేను శ్రీ పి. వెంకటేశ్వర్లుగారి అభిప్రాయం సరికాదని రూలింగు ఇస్తున్నాను.

*శ్రీ పి. సుందరయ్య : ప్రభుత్వానికి వ్యతిరేకంగా నాలుగు పార్టీలు ప్రతిపక్షంగా కూర్చోవచ్చు. అది వేరేసంగతి. మన శాసనసభా వ్యవహారాలలో recognised opposition party ఒక్కటేఉంది. కాబట్టి దానికే ఈ debates ను open చేయడానికి లేదా close చేయడానికి అధికారం ఉంది. ఈ recognised opposition party ఇతర ప్రతిపక్షాలవారికి, వీలునుబట్టి, వారితో సంప్రదించి, ఈ చర్చలలో పాల్గొనడానికి అవకాశంఇస్తూఉంటుంది. లోగడ పార్లమెంటులో ఏ పార్టీలను opposition parties గా recognise చేయాలనే ప్రశ్న వచ్చినపుడు "ఏ పార్టీలైతే ఎన్నికల సమయంలో ఒక నిర్దుష్ట కార్యక్రమంతో ప్రజలవద్దకు పోతాయో, వాటినే opposition parties గా recognise చేయాలని" స్పీకర్ రూలింగు ఇచ్చారు. ఈ పార్టీల సభ్యులు ఎక్కువరావచ్చు, లేక వోడిపోవచ్చు. అది వేరేసంగతి. నేషనలిస్టుపార్టీకాని, వావిలాల గోపాలక్రిష్ణయ్యగారి పార్టీ కాని ఎన్నికలలో ఒక పార్టీగా contest చేయలేదు. మన శాసనసభా వ్యవహారాలను సవ్యంగా నడుపుకొనుటకు ఈ రెండింటిని అసెంబ్లీలో recognise చేసిన groups క్రింద మనం చూడవలసి ఉంటుంది. నేషనలిస్టు group ప్రభుత్వపక్షాన్ని ఎక్కువగా బలపరుస్తూ ఉండవచ్చు, అదేవిధంగా వావిలాలవారి గ్రూపు ప్రతిపక్షంతో ఎక్కువ సహకరిస్తూ ఉండవచ్చు. అవి అన్నీ వేరేవిషయాలు. బడ్జెట్టు demands ను open చేసే అధికారం మాత్రం recognised opposition party వారిదే. మేము అంగీకరిస్తే రామకృష్ణరాజుగారుకానీ, కాంగ్రెస్‌పార్టీవారు కానీ మాట్లాడవచ్చు. ఆ అంగీకరించడం మా చేతుల్లో ఉంటుంది కాబట్టి, దానిని దృష్టిలో ఉంచుకొని వ్యవహరించాలని కోరుతున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : ఆవిషయంలో సందేహమేమీలేదు. దానిని గురించి చర్చ అనవసరమని నా అభిప్రాయం. Cut Motions move చేసినవారే చర్చను ప్రారంభించడం న్యాయం. ఇతర legislatures లో కూడా అదేవిధంగా జరుగుతోంది. కాంగ్రెస్ పక్షంలోనివారుకూడా ఎక్కువగా cut motions ఇస్తున్నారు. ఇదివరకు ఆవిధంగా ఇచ్చేవారు. ఇప్పుడు ఇస్తున్నారో లేదో నాకు తెలియదు. కాబట్టి cut motions ఇచ్చినవారే debate ను ప్రారంభించడం న్యాయం.

శ్రీ పి. సుందరయ్య : ప్రభుత్వపక్షం ఎప్పుడూ cut motions ఇవ్వడం అనేది లేదు. కాగితంమీద notice ఇచ్చినా కాంగ్రెస్ యొక్క whip ప్రకారం వారు ఇంతవరకు ప్రతిపాదించలేదు. కర్నూలులో ప్రతిపాదించలేదు, ఇక్కడా ప్రతిపాదించలేదు. చర్చల్లో వారి అభిప్రాయాలు చెప్పవచ్చేకాని, cut motions ఇవ్వడమనేది ruling party యొక్క సంప్రదాయంకాదు. Ruling Party కి వ్యతిరేకంగా ప్రతిపక్షమే cut motions ఇవ్వడం జరుగుతోంది.

శ్రీ డి. కొండయ్య చౌదరి (కందుకూరు) : అధ్యక్షా, ఒక point of information తెలియజేస్తున్నాను. తాము కమ్యూనిస్టు పార్టీనిగురించి శెల విస్తూ, అదే real opposition party అని చెప్పారు. మిగిలినవి మాత్రం ఆ విధంగా కాదాఅని అడుగుతున్నాను. కొంచెం clarify చేస్తారా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : అధ్యక్షా, ఇంతవరకు cutmotions ఇచ్చినవారే సాధారణంగా "ఇనీషియేటివ్" చేయడమనే "కన్వెన్షన్" జరుగుతోంది. కాబట్టి ఇప్పుడుకూడా అదేవిధంగా ఉండాలి.

*Mr. Speaker :* I entirely agree with Sri P. Sundariah, the Leader of the Opposition. సోషలిస్టుపార్టీలో ఇప్పుడు సభ్యులైనవారు ఎన్నికలలో వ్యక్తిగతంగా elect అయి ఇక్కడ ఒక పార్టీగా ఏర్పడినారు. వారు ఎంతవరకు ప్రభుత్వానికి support చేస్తారు, ఎంతవరకు oppose చేస్తారు, అనేది నాకు సంబంధించిందికాదు. అట్లాగే వావిలాల గోపాలకృష్ణయ్యగారికి కూడా వర్తిస్తుంది. వారికి ఏదోఅవుతుందని అనుకోకండి. సోషలిస్టు పార్టీ కొన్నిరోజుల నుంచి recognise అయింది. వావిలాల గోపాలకృష్ణయ్యగారు తమనుకూడా recognise చేయమన్నారు. కాబట్టి వారిని ఒక group గా recognise చేశాము. The two parties that came as opposition in elections with a definite programme are the Communists and the Socialists.

కమ్యూనిస్టులు 37 మంది, సోషలిస్టులు 18 మంది ఈ సభలో ఉన్నారు. మెజారిటీ కమ్యూనిస్టులే గనుక వారికే debate ను ప్రారంభించే హక్కు ఉంది. వారు కావాలంటే సోషలిస్టులకు "ఎకామొడేట్" చేయవచ్చు.

రామకృష్ణరాజుగారు చెప్పిందికూడా రైటే. Cutmotions యివ్వనివారిని పిలవడం న్యాయంకాదు. అది వేరే సంగతి.

శ్రీ టి. పాపారావు (కటకం) : మీరు నేషనలిష్టు పార్టీ ప్రతిపక్షంలో ఉందంటారా ? లేక కాంగ్రెస్‌తో గల సంబంధాన్నిబట్టి దానిని కాంగ్రెస్ పార్టీయే అని అంటారా ? దానికి ఏదైనా ఒక డెఫినిషన్ ఇస్తారా ?

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు నేషనలిష్టు పార్టీలో ఉన్న సభ్యులు వ్యక్తిగతంగా ఎన్నికలలో కాంగ్రెస్‌వారితో పోటీచేసి, ఇక్కడకు వచ్చాక ఒక పార్టీగా form అయ్యారు. వారిలో కమ్యూనిష్టు supported ఎవరో, సోషలిష్టు supported ఎవరో, లేకపోతే వారికీ మీకూ భేదం ఏమిటో నాకు తెలియదు. అసలు ఎన్నికలలో పార్టీలుగా వచ్చినవారు కమ్యూనిష్టులు, సోషలిష్టులు మాత్రమే. ఇందులో అభిప్రాయభేదం లేదు. కాబట్టి దానినిగురించి చెప్పవలసిన అవసరం లేదు. Therefore I call upon Sri M. Nagi Reddi to begin.

*శ్రీ ఎం. నాగిరెడ్డి : అధ్యక్షా ! ఈ సంవత్సరం కొత్తగా ఈ Local Administration Demand అనేది పెట్టడం, దానిమీద ప్రత్యేకంగా అందరూ మాట్లాడడం, మంత్రిగారు సమాధానాలు ఇవ్వడం అనేటటువంటి అవకాశం ఇచ్చినందుకు సంతోషిస్తున్నాను. కాని ఒకవైపు కుడిచేతితో ఇస్తూ, రెండవ వైపు ఎడమచేతితో తీసుకున్నట్లుగా ఈ demand ను పెట్టారు. Miscellaneous Demand 35, Local Administration Demand 36, ఈ రెండింటినీ కలిపి ఎక్కడలేని items ఇందులోనే చేర్చేరు. "Contribution to Panchayats under Section 71" అనేదానిని ఈ పద్దులో చేర్చారు. "Contribution to the territorial army fund, State boundary landing grounds", నైజాముకు ఇచ్చే పరిహారం జమీందారులకు ఇచ్చేపరిహారం, ఇవి అన్నీ కలిపి చౌ, చౌ రకంగా ఈ demand ను తయారుచేయడం మాత్రం సమసంజంగా లేదు. ఏ ఒక్క demand లోను అలాగ కలపలేదు. మంత్రిగారు జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయితీ బోర్డులు, వీటి అన్నింటి విషయాలు, కొంత వరకు వివరంగానే చెబుతూ వచ్చారు. కాని, 1952 వ సంవత్సరంనుంచి ఆంధ్రజిల్లాబోర్డులు, ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం, ఒక Special Officer పరిపాలనక్రింద సాగుతున్నట్లు మనం చూస్తూనే ఉన్నాము. అంతేగాక, ఎప్పటికప్పుడు, Advisory Committees ను వేయడం, వేసిన వెంటనే తీసివేయడం, ఈవిధంగా జరుగుతూన్నది. మళ్ళీ ఇప్పుడు Block Councils, District Councils వస్తున్నాయని మంత్రిగారు చెబుతున్నారు. ఇవి వచ్చే టప్పటికి ఏ 5, 6 సంవత్సరాలో పడుతుంది. ఇవి వచ్చేవరకు జిల్లా బోర్డులు, అవిధంగా Special Officer పరిపాలనక్రింద ఉంటవి అన్నమాట. వాళ్ల

పరిపాలన, ఈ Hospitals, Roads, Schools, మొదలైన విషయాలలో, ఎంత అధ్వాన్నంగా ఉన్నదో, పరిపాలనలో ఎన్ని అవకతవకలు జరుగుతున్నాయో, అన్నిపక్షాల సభ్యులందరూ, పదే, పదే చెబుతూనే ఉన్నారు.

మద్రాసు ప్రభుత్వం ఈమధ్యనే వీటి విషయంలో, అక్కడ స్థానిక M. L. A. s తో, లేక M. P. s తో, లేక కనీసం ఆ District కు సంబంధించిన వాళ్ళతోనైనా, Committees ఏర్పాటుచేసి, వీటిని function చేయించాలని ఒక నిర్ణయానికి వచ్చినట్లు తెలుస్తున్నది అదేవిధంగా ఇక్కడ ఈ District Councils వచ్చేవరకైనా, అలాంటి Committees ఆధ్వర్యంలో, జిల్లాబోర్డుల పరిపాలన ఉన్నట్లయితే ఎంతో సమంజసంగా ఉంటుంది. అలాగ చెయ్యలేని పక్షంలో శీఘ్రంగా, ఈ సంవత్సరం ఆఖరులోనే, District Councils వచ్చే టట్లు చూడాలి. ఈ District Councils లో, Block Councils లో నుంచి ఎన్నుకోబడినవాళ్ళు ఉంటారనే పద్ధతిలో పెడుతున్నారు. ఈ విధానం ఏమాత్రము సమంజసంగాలేదు. వాటికికూడ ఇతరవాటిల్లోవలె ఎన్నికలవిధానాన్ని అవలంబించడం సరియైన పద్ధతి. ఆ విధంగా చెయ్యాలని నేను ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ఇప్పుడు కొత్తగా పెట్టిన మునిసిపాలిటీలకు సంబంధించిన ఎన్నికలవిషయం మంత్రిగారు చెబుతూ "Partiality లేకుండా, నిష్పక్షపాతంగా ఈ మునిసిపాలిటీల విషయంలో మేము ఏదో చేస్తుంటే, కొంతమంది ఏదో వాళ్ళకు అనుకూలంగా చెయ్యలేదని మాపై అన్యాయంగా విసుర్లు విసురుతున్నారు" అని గోపాలరావు ఎక్‌బోటే గారిని ఉదహరణంగా తీసుకొని చెప్పారు. అది వాస్తవమే అయితే, Municipality లకు సంబంధించి నేను ఒక్క విషయం మాత్రం అడగదలచుకున్నాను.

ఎన్నికలు రేపో ఎల్లుండో జరుగుతాయి అనగా, విజయవాడలో ward లను విభజించడానికి కారకులు ఎవరు? అంతేకాకుండా విజయవాడ, గుంటూరులలో మునిసిపల్ ఎన్నికలను ఎన్నిసంవత్సరాలనుంచి పొడిగిస్తూ వస్తున్నారు? అంతవరకు పోవవసరంలేదు. ఇప్పుడు సామర్లకోటను మునిసిపాలిటీగా convert చేశారు. కాని ఇప్పటికి రెండు సంవత్సరాలనుంచి, అది Special Officer పరిపాలనలో ఉన్నది. మునిసిపాలిటీ అని declare చేసిన తరువాతకూడ ఓటర్ల లిస్టు పంపేవరకు అక్కడ ఎన్నికలు జరిపించడానికే వీలులేదని, అక్కడ ఎన్నికలను ఆపుచేశారు. ఈవిధంగా జరగడానికి కారణం ఏమిటి? అదివరకు సామర్లకోటలో మూటికి నూరుపాళ్ళు కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఉండేవారు అధికారంలోకి వచ్చారు. అందుకని ఏదో ఒక రూపంగా వార్డులను విభజించి, ఇప్పటికి రెండు సంవత్సరాలనుంచి ఎన్నికలు లేకుండా కాలయాపన చేస్తున్నారు.

చివరకు, 13-12-1957 న వార్డులను విభజించి Gazette Publication చేశారు. ఓటర్ల జాబితా తయారు చెయ్యమని 14-12-1957న ప్రభుత్వం order ఇచ్చింది. అవి తయారైన తరువాత February 24, 25, 26 తేదీలలో nomination లు పంపాలని, తారీఖులు నిర్ణయించి, అక్కడ ఉన్న Commissioner గారు, ప్రభుత్వానికి వ్రాస్తే, తుదకు అక్కడ ఉండే స్థానిక కాంగ్రెసువారి ఒత్తిడితో ఎన్నికల తేదీని confirm చేసికూడ, ఆఖరు క్షణంలో ఏదో ఒక సాకు చెప్పి ఎన్నికలను జరిపించకుండా వాయిదా వేశారు. తదుపరి మళ్లీ ఒక తేదీని నిర్ణయించమన్నారు. మొన్న మార్చి నెలలోనే తేదీ నిర్ణయించి పంపిస్తే, ఇంత వరకు మంత్రిగారు order వెయ్యలేదు. ఈ విధంగా రెండుసార్లు ఎన్నికలకు తేదీ నిర్ణయించడం రెండు సంవత్సరాలనుంచి Special Officer పరిపాలనక్రింద ఉంచడం ఎంత విచారకరమైన విషయమో ఆలోచించాలి. ఒక వైపు Local Self Government వారు, స్థానిక స్వపరిపాలనకు అధికారాలు ఇవ్వాలని అంటూ, ఈ విధంగా జాప్యం చెయ్యడం ఎంతవరకు సమంజసమో మంత్రిగారు ఆలోచించవలసిన అవసరం ఉన్నది. ఇదే విధంగా, పల్నాడు తాలూకాలో జరిగితే, శ్రీ నాగేశ్వరరావుగారు మంత్రిగా ఉన్నప్పుడు, రెండు పంచాయితీలకు additional seats ను allot చేయడంలో ఎక్కువ ఓట్లు ఉన్నవాటికి చెయ్యకుండా, తక్కువ ఉన్నవాటికి allot చేస్తే, ఈ విషయం నాగేశ్వరరావుగారికి represent చేస్తే, వారు అది తప్పు అని ఒక stay order ఇస్తే, ఇప్పుడు ఈ మంత్రివర్గం వచ్చినతరువాత ఒక పంచాయితీలో మాత్రము revise చేసి, additional seat ను allot చేశారు. శంకరాపురం పంచాయితీ విషయంలో మాత్రం జరిగింది ఏదో జరిగిపోయింది అని, మాజీ మంత్రిగారు వేసిన stay order ను రద్దుచేసి additional seat తప్పుగా పడిందనే సాకుచూపి ఈ మంత్రి గారు మళ్ళీ ఎన్నికలు జరిపించాలని order వేశారు. ఈ విధంగా ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. ఇప్పుడు, Local Administration Department కు సంబంధించిన, I. G. దగ్గరనుంచిగాని, ప్రభుత్వపక్షంనుంచి వచ్చే order లు చాల పక్షపాత దృష్టితో వస్తున్నాయని స్పష్టంగా కనబడుతున్నది. వీటిని అన్నింటినీ మంత్రిగారు సరిదిద్దకపోతే, అన్ని పక్షాలవారు అసంతృప్తి చెందడమేగాక, ప్రభుత్వాన్ని తీవ్రంగా ఆక్షేపించడానికి అవకాశాలు ఇస్తున్నారని విదిత మవుతుంది.

మంత్రిగారు చెప్పినప్రకారం, ఆంధ్రలో 9 వేల పంచాయితీలు ఉంటే, వాటికి వొచ్చే ఆదాయం ఒకకోటిరూపాల పైచిల్లరని చెప్పారు. Average గా లెక్కవేస్తే, ఒక్కొక్క పంచాయితీకి 11 లేక 12 వందల రూపాయల ఆదాయం వస్తున్నది అన్నమాట. ఇంతకొద్ది ఆదాయంతో ఇవి ఏవిధంగా నిర్వహిస్తున్నాయో ఆలోచిస్తే, వీటికి అన్నింటికీ, economic stability లేదని మాత్రం

స్పష్టంగా కనబడుతున్నది. వీటి ఆదాయం అభివృద్ధిచేయకుండా Act లో ఉదహరించిన ప్రకారం, Land Ravenue లో కొంత భాగాన్ని వాటికి ఇవ్వకుండా "Profession Tax, House Tax లు వేసుకోండి" అని అనడం, ఏమాత్రం సంతృప్తికరంగాలేదు.

ఇక పోతే, ఈ తెలంగాణా శాసనంలో, ఎన్నికలు secret ballot ద్వారా నడిపించాలని ఉన్నది. అక్కడ, మన మద్రాసు చట్టంలో, ఎన్నికలు, చేతులుఎత్తే పద్ధతిలో జరుగుతున్నవి. ఈ పద్ధతిమాత్రం చాల అనర్ధదాయకంగా కనబడుతున్నది. కనుక ఇప్పుడు, Election Commission చెప్పినప్రకారం గుర్తు పెట్టే పద్ధతి వచ్చింది కాబట్టి దానిని దృష్టిలో పెట్టుకొని, రేపు intigrated act లో ఆవిధంగా ఉండేటట్లు రూపొందించి, అమలుజరిగేట్లు చూడాలి. ఈ ఎన్నికల విధానం ఒక్కొక్క ప్రాంతంలో, ఒక్కొక్క రకంగా ఉండడం మంచిదికాదని మా అభిప్రాయము.

ఇదివరకు President ఎన్నిక, direct election గా ఉండేది. ఇప్పుడు దీనిని మార్చి, member లలో నుంచే direct ఎన్నిక జరిపించాలని అంటున్నారు. ఎందుకంటె, minority తరఫున President గా ఉన్నట్లయితే, majority members వ్యతిరేకమైనప్పుడు, administration దెబ్బతింటుందని, అంతేగాక, no confidence motion పెట్టడానికి వీలు ఉండదని అప్పుడు ఉన్నటువంటి మంత్రివర్గం చెప్పింది. ఈవిషయములో నేను అడిగేది ఏమంటే, majority member లు president కు వ్యతిరేకము అయినాకూడా, no confidence motion పెట్టే అవకాశం పంచాయితీ act లో ఉన్నదా? లేదా?

ఎప్పటికి ఏది అవసరమో అప్పుడు అది చెప్పుకొని ఏవో Bills ను pass చేసుకుంటూరు తప్పితే, ప్రజలకు ఏది అనుకూలమో అది మాత్రం చూడరు. ఇది ప్రజలకు సంబంధించిన కార్యక్రమం కాబట్టి direct election తోనే President ఎన్నిక కావడం చాల మంచిదని దానిని ప్రభుత్వం ఆలోచించాలని మనవి చేస్తున్నాను.

పంచాయితీల ఆర్థికస్థితి చాలా వెనుకబడి ఉన్నది. House tax, profession tax వగైరాలు చాల పరిమితమైన పద్ధతిలో మాత్రమే వెయ్యడానికి వీలున్నది. 15,000 రూపాయలకు మించి ఆదాయం ఎంత ఉన్నప్పటికీ, ఒకే rate తో tax వెయ్యడం జరుగుతున్నది. ఉదాహరణకు, ఆంధ్ర సిమెంటు కంపెని branch మా పల్నాడు తాలూకాలో నడిపూడి పంచాయితీ area లో ఉంటే, వాళ్ళకు సంవత్సరానికి 10 లక్షల రూపాయలు ఆదాయం వస్తే, అక్కడ పంచాయితీవాళ్ళు పన్ను వెయ్యాలన్నప్పుడు బెజవాడ మా Head office కాబట్టి ఇక్కడ వెయ్యడానికి వీలులేదని అంటున్నారు. కనీసం

రెండు Municipalities ని కలిపి proportionate allotment ఇచ్చినప్పటికీ అర్థసంవత్సరానికి 125 రూపాయలు మాత్రమే వస్తుంది.

పదిలక్షలు ఆదాయంవచ్చేటటువంటి కంపెనీలమీద కూడా 15 వేల రూపాయలవరకు maximum profession tax పెట్టారు. ఎప్పుడైతే యీ maximum profession tax పెట్టారో, అపుడు ఇంకా ఎక్కువ రావడానికి అవకాశములేదు. ఐదు రకాలైన పోరంబోకులున్నాయి. మందబయళ్ళనేవి ఉన్నాయి. యీలాంటివాటిని పంచాయితీలకు అప్పగించే విషయమున్నది. అన్ని పోరంబోకులను యీ పంచాయితీలకు అప్పజెప్పినట్లయితే ఆదాయము పెరగడానికి అవకాశమున్నది. తర్వాత రెవిన్యూ డిపార్టుమెంటువారితో conflict లేకుండా ఉండడానికి అవకాశముంటుంది. అదేవిధంగా 1 వ section 77 ప్రకారం చెరువులు, కుంటలు ఇవన్నీకూడా పంచాయితీలకు అప్పగించాలని ఉన్నప్పటికికూడా ఆచరణలో మాత్రము కన్పించడంలేదు.

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు (రాజమండ్రి) : అధ్యక్షా, ఈ సంవత్సరమే మొదటిసారిగా యీ Local Administration Demand ను తీసుకురావడము సంతోషమేకాని యీ డిమాండుక్రింద చూపించిన అంకెలనుబట్టి చూస్తే ఇది eye-wash క్రింద తప్ప మరేవిధంగా కూడా కనబడడములేదు. మాకిచ్చిన Budget memorandum లో 35, 36 డిమాండులు కలిపి అంకెలు చూపించినారు. కాని 36 వ డిమాండుక్రింద మూడు items మాత్రమే చూపించినారు. (1) contributions (2) charges in connection with the Village Panchayat Act; and (3) Miscellaneous and unforeseen charges. ఈ మూడింటి వివరాలలోకి వెళ్లేటట్లయితే, ఇవి waste paper basket లోనికి పోవలసిందేనని తెలుస్తుంది. అవి ఎందుకూ పనికిరాని items. కావలసిన items అన్నీ Local Administration Demand క్రింద చూపించలేదనీ మాత్రము మనవి చేస్తున్నాను. ఇందులో ముఖ్యంగా water supply, drainage schemes మొదలైనవి కూడా యీ Local Administration క్రిందనే జరుగుచున్నప్పటికీ ఈ items ను చూపించకపోవడము చాల గర్హ్యనీయమైన సంగతి. తర్వాత Municipal Act ను పంచాయితీ Act ను integrate చేస్తామని యీ ఆంధ్రప్రదేశ్ వచ్చినప్పటినుంచి చెప్పుచున్నారు. ఇపుడు తెలంగాణాలో మునిసిపల్ ఎలెక్షన్‌లు పెటుతామని చెప్పుతున్నారు. ఆంధ్రప్రదేశ్ వచ్చిన తర్వాత integration of laws కొరకు ఒక ఆఫీసర్‌ను appoint చేయడము, మళ్ళీ కొన్నాళ్ళయిన తర్వాత వారిని మార్చడము ఇంకొక ఆఫీసరును వేయడము జరిగింది. ఈ integration ఎపుడు జరుగుతుందో తెలియదు. ఇది చాల అత్యవసరమైన సంగతి. Composite Madras State నుంచి ఆంధ్రరాష్ట్రము separate అయినప్పటినుంచి కూడా ఈ Municipal Act ను amend చేయ

డానికి ప్రయత్నాలు జరుగుచున్నవి. Chamber of Municipal Chairmen కూడా చాల కాలమునుంచి ఈ Act ను amend చేయవలసిందని తీర్మానాలు పంపించుతూనే వున్నారు. కనుక త్వరలో ఈ Act ను amend చేయవలసిందని కోరుతున్నాను. 1956 సం. రంలో నాకు తెలిసినంతవరకు Local Administration Ministers' Conference లో ఒక తీర్మానము కూడా చేశారు. కేంద్ర ప్రభుత్వమువారు " ఒక Model Corporation Act, ఒక Model Panchayat Act, ఒక Model Municipal Act ను తయారుచేసి పంపిస్తున్నామని, దాని ప్రకారం మీరు చేయవలసి ఉంటుంది" అని ఒక తీర్మానము చేశారు. తదనంతరము ఏమి జరిగిందో తెలియదు. గౌరవనీయులైన మంత్రి గారు ఆ విషయమును గురించి ఏమీ చెప్పలేదు. పంచాయితీలకు స్టేట్ గవర్నమెంటుకు ఒక intermediary body వుండాలని 1956 సం.లోనే Local Administration Ministers' Confernce లో ఒక తీర్మానము కూడా pass చేశారు. ఒకప్రక్కన ఆంధ్రరాష్ట్రంలో జిల్లాబోర్డులను రద్దు చేస్తామంటూంటే, మరొక ప్రక్కన తెలంగాణా ప్రాంతంలో nominated elected మెంబర్లతో జిల్లాబోర్డులు constitute అయిఉన్నవి. District Councils పెట్టుతామని White Paper యిచ్చారు. కాని ఈ District Councils ఏ stage లో వున్నవో ఎప్పటికి వస్తాయో మంత్రిగారు సెలవివ్వలేదు. Local Administration Ministers' confernce లోని తీర్మానము ప్రకారము యీ District Councils ను త్వరగా తీసుకురావాలని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. యీ మునిసిపాలిటీలకు కాని, పంచాయితీలకుగాని, water supply schemes కు drainage schemes కు 1958-59 వ సంవత్సరములో ఎంత యివ్వబడుతుందో Local Administration Head క్రింద చూపించలేదు. దానినిగురించి ఆఖరున మంత్రిగారు జవాబు చెప్పుతారని ఆశిస్తున్నాను. మంచినీళ్ళ సప్లయి విషయంలో national rural Water Supply and Sanitation Programme క్రింద కర్నూలులో వుండేటపుడు నాలుగు యూనిట్లు ఏర్పరచారు. నీళ్ళు ఉన్నచోట్లనే improvement చేశారు కాని నీళ్ళులేనిగ్రామాల విషయమునుగురించి తలపెట్టలేదు. ముఖ్యంగా తూర్పు గోదావరి జిల్లా చాల advanced జిల్లా అని చెప్పుతారు. రాజమండ్రి తాలూకాలో 18 గ్రామాలలో మంచినీళ్ళు లేవు. Composite మద్రాసు స్టేటులో వున్నపుడు చాగలనాడు rural water supply scheme తోబాటు కోవెల పట్టణము scheme ను start చేశారు, కాని ఇంతవరకు ఆంధ్రప్రదేశ్ లో యీ 18 గ్రామాలకు త్రాగడాని మంచినీళ్ళు దొరకడములేదు. ఈస్కీము Chief Engineer of Public Health Office లో investigate చేయబడి సిద్ధంగావుంది. దానిని వీలైనంతత్వరలో అమలు పరుస్తారని ఆశిస్తున్నాను. Engineers ను regularise చేసే విషయంలో rules కూడా frame చేశారు. ఈ rules

ఆంధ్రలో వున్నపుడు చేశారు. ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తర్వాత యీ rules ను ఆ rules ను integrate చేయాలని తెలవిచ్చినట్లు కన్పించుచున్నది. ఈ rules integrate చేయడమువల్ల కొందరు ఆఫీసర్లకు T. A, D. A. విషయంలో లాభించుతుంది. వీటిని త్వరలో integrate చేస్తారని ఆశిస్తున్నాను ఇందాక మంత్రిగారు చెప్పినదానిలో secretaries, revenue officers, accountants, managers విషయంలో కూడా rules publish చేస్తామన్నారు. వీలైనంత త్వరలో చేయవలసిందని కోరుతున్నాను. మంత్రిగారు తాము పక్షపాతంగా ఏమి చేయడములేదని అన్నారు. నాగిరెడ్డిగారు చెప్పినట్లు విజయవాడలో మునిసిపల్ ఎలెక్షన్‌లు కొద్ది రోజులలో వస్తూవుండగా అక్కడ వార్డులను తిరిగి పునర్విభజనచేసి అన్యాయము జరిపినారని మాత్రము వారికి మనవిచేస్తున్నాను. వారిని కోరేది ఏమిటంటే ఏదైనా వ్యక్తిగతంగా అభిప్రాయభేదమున్నా, రాజకీయముగా, ప్రభుత్వదృష్ట్యా అటువంటిఅన్యాయాలు ఇకముందు చేయవద్దని నేను మనవిచేసుకుంటున్నాను. Town planning విషయము కూడా Local Administration లో ఒక భాగముగా వున్నది. దీనిని కూడా యీ డిమాండ్ క్రింద చూపించలేదు. Town planning department లో కొన్ని అవకతవకలు జరుగుచున్నవి. మనము Composite Madras State లో వున్నపుడు Town planning rules విషయంలో ఒకExpert Committee నివేయడము, అది కొన్ని సూచనలు చేయడము జరిగింది. నిత్యకృత్యములో వచ్చేటటువంటి యిబ్బందులు చాలఉన్నవి. అందుకనే ఈ rules విషయంలో ఒక Expert Committee ని వేసి Town Planning Act లో కొన్ని rules ను వీలైనంత త్వరలో మార్చవలసిందని మనవిచేస్తున్నాను. పంచాయితీలకు నిత్యకృత్యములలో చాల కష్టాలు కలుగుతున్నాయి. పోరంబోకుల విషయంలో Revenue Departmentకు Local Administration Department కు తగాదాలు చాల వస్తాయి. ఈ పోరంబోకుల విషయంలోను fishing rights విషయంలోనూ అవసరమైనచోట్ల ఈ rules ను మార్చవలసిందని మనవి చేసుకుంటున్నాను. మంత్రిగారు మాట్లాడుతూ తెలంగాణా జిల్లాబోర్డులకు 50% కంటే ఎక్కువఖర్చు కాలేదన్నారు. చాలమంది సభ్యులు మాకు ఇంత డబ్బువుంటే ఎందుకు ఖర్చు పెట్టలేకుండా పోతున్నారని అంటున్నారు. ఆంధ్రలో డబ్బులేక ఖర్చుపెట్టకపోతే తెలంగాణాలో డబ్బువుండికూడా ఖర్చుకాకుండా పోవడానికి కారణమేమిటో విచారించి వీలైనంతవరకు ఆ డబ్బును ఖర్చుపెట్టవలసిందిగా మంత్రిగారిని కోరుచున్నాను.

కేంద్రప్రభుత్వం స్థానిక స్వపరిపాలనా మంత్రుల సమావేశం జరిపినపుడు పంచాయితీ సభ్యులకు పంచాయితీ ఉద్యోగులకు ప్రత్యేక శిక్షణ ఇవ్వాలని దానికై కొంత కేటాయింపు చేస్తామని 1956 వ సంవ

త్సరంలో తీర్మానం చేయడం జరిగింది. ఆ విషయం ఇప్పుడేస్థితిలో ఉన్నదీ తెలియదు. ఇతర రాష్ట్రాలలో స్థానిక స్వపరిపాలనలో శిక్షణ ఇవ్వడానికి పాఠశాలలను కళాశాలలను పెట్టడం తటస్థించింది. మన రాష్ట్రంలోకూడా అటువంటి ఏర్పాట్లు చేయడానికి కర్నూలులో ఉండగా ప్రయత్నంచేయడం జరిగింది. కాని అపుడు జరుగలేదు. ఈ సంవత్సరములో కాకపోయినా వచ్చే సంవత్సరంలోనైనా ఇటువంటి శిక్షణ ఇవ్వడానికి ఒక సంస్థను నెలకొల్పితే బాగుంటుందని మనవిచేస్తున్నాను. గ్రామ పంచాయితీలకు భూమిశిస్తులో $11\frac{1}{9}\%$ ఇచ్చే ఏర్పాటును ఆంధ్రప్రాంతములో ధనాభావంవల్ల అమలు చేయడం లేదు. బడ్జెటు మెమోనుబట్టి తెలంగాణాలో 15% ఇస్తున్నట్లు కనిపిస్తోంది. మంత్రిగారు ఆ ప్రకారంగా ఇస్తున్నట్లు చెప్పారు. గౌరవ సభ్యులు ఇవ్వడంలేదన్నట్లుగా చెప్పారు. ఈ విషయమై స్పష్టంగా ఆఖరు ఉపన్యాసంలో మంత్రిగారు తెలియచేయాలని కోరుతున్నాను. రాజమండ్రిలో గోదావరిగట్టును వెడల్పుచేసే పనికై (Godavari bund widening scheme) టెండర్లను పిలవకుండా మునిసిపాలిటీవారే nomination work క్రింద చేస్తున్నారు. ఇది 80 వేల రూపాయలపని, urgentగా కానిపని. ఈ రకంగా చేయడం అన్యాయం. 7, 8 సంవత్సరాలనుంచి జరుగుతున్నపని, టెండర్లను పిలిస్తే నెలరోజులకంటె ఆలస్యంకాదు. ప్రభుత్వం మునిసిపాలిటీవారికి అనుమతి ఇచ్చిందని మునిసిపాలిటీవారు చెబుతున్నారు. ఇచ్చారో లేదో తెలియదు. ఇవ్వకపోతే ఇవ్వవద్దు అని ప్రజలడబ్బు కనుక దుర్వినియోగం జరుగకుండా న్యాయంగాను ధర్మంగాను రూల్సు ప్రకారం ఆ పని చేయించాలని మంత్రిగారిని కోరుతున్నాను. మునిసిపాలిటీలకు పంచాయితీలకు ఎక్కువ అధికారాలు ఇవ్వడానికి మనం ప్రయత్నం చేస్తున్నాము. మునిసిపాలిటీ చట్టాన్ని వీలైనంత త్వరలో సవరించి అటువంటి హక్కులు కలిగించాలని కోరుతున్నాను.

*శ్రీ పి. ఎన్. అప్పారావు (పాలకొండ): అధ్యక్షా, ఇది వరకు ఉన్న మంత్రులు ఈ డిమాండును విడిగా చూపించలేకపోయినా ఇప్పటి మంత్రిగారీ శాఖా డిమాండును విడిగా తీసుకువచ్చినందులకు సంతోషిస్తున్నాము. ఇదివరకు ఉన్న మంత్రివర్గాలు జిల్లాబోర్డులను, చచ్చిన శవాలకు ప్రతి సంవత్సరం "మితాలను" పెట్టినట్లు, ఎన్నికలను పెట్టకుండా స్పెషలాఫీసర్ల అధికారాన్ని ప్రతి సంవత్సరమూ పొడిగించుకుంటూ వస్తున్నవి. ఇలా అయిదు సంవత్సరాలు గడిచిపోయాయి. ఇంతవరకు జిల్లాబోర్డు లనేవి ఉన్నాయా లేదా వాటి అతీగతీ లేకుండా పోతున్నవి. పరిపాలనను స్పెషలాఫీసర్ల చేతిలో పెట్టారు. జిల్లా కలెక్టరును స్పెషలాఫీసరుచేసి అధికారం ఇచ్చారు. జిల్లాబోర్డులు అధికారం చేయడం ఎప్పుడు; ప్రజలు మంచీచెడూ చెప్పుకోడం ఎప్పుడు? ఈ సమస్యను పరిష్కారం చేయాలనే ఆలోచన ప్రభుత్వానికి ఇప్పటికైనా ఉన్నదా, లేదా అని అడుగు

తున్నాను. జిల్లా కలెక్టరుకు ఎంతపని ఉంటుంది; ఈ జిల్లాబోర్డు వ్యవహారాలను కూడా చూడడానికి తీరిక ఉంటుందా అనే విషయం ఆలోచించవలసి యున్నది. బ్లాక్ కౌన్సిళ్ళను పెడతామని White Paper ఒకటి యిచ్చారు. ఎప్పుడు ఈ Councils పెడతారు; ప్రజలేమి సౌఖ్యపడతారు? ఎన్నాళ్ళు ప్రజలు కలెక్టరు దగ్గరకు వెడతారు? అసలు కలెక్టరుగారు ఎక్కడ దొరుకుతారు? జిల్లా అంటే 200 చదరపుమైళ్ళు ఆవరణ తిరుగవలసి ఉంటుంది. జిల్లాబోర్డుతో అవసరం లేని వ్యక్తి ఉండడు. ప్రతివానికి ఏదో సంబంధం ఉంటుంది. ఒక ఉపాధ్యాయుడు పోయి చెప్పుకోవాలన్నా కలెక్టరు దగ్గరకు వెళ్ళాలంటే ఎక్కడ సాధ్య పడుతుంది? కౌన్సిల్సును పెడితే పెట్టవచ్చును. అవి పనిచేస్తున్నాయని మీరు అనుకోవచ్చును. ఇపుడు బ్లాకులు ఏ రకంగా పనిచేస్తున్నాయో అవికూడా అట్లాగే పనిచేస్తాయి. దానిని ప్రభుత్వం అమలు చేయడానికి వ్యవధి కావాలనుకుంటే అనధికారులను ప్రసిడెంటుగా పెట్టండి. అయిదు సంవత్సరాలనుంచి ఇలాగే ఉంచివేయడం సరిఅయిన పద్ధతికాదు. మాజీ మంత్రిగా రున్నారు; ఆయన అధికారంలో ఉన్నంత కాలం ఏదో కాలక్షేపం చేసుకుంటూ వచ్చారు. ఆయన ఇప్పుడున్న మంత్రిగారిమీద ఏదో చెప్పారు. పోయినవారు వచ్చినవారిమీద చెప్పే సావకాశం ఉంటూనే ఉంటుంది. చట్టంచేసి కౌన్సిళ్ళను ఏర్పరచే వరకు ఇప్పుడున్న పరిస్థితే ఉండకుండా ప్రభుత్వానికి వచ్చిన అనధికారులను nominate ను చేయండి. అంతేకాని అధికారుల చేతుల్లో పెట్టి ఇట్లాగే 'మితాలు' పెట్టుకుంటూ పోయే పద్ధతి మంచిదికాదు, ప్రతి గ్రామానికి పంచాయితీ బోర్డును పెట్టారు. అంటే ప్రతిగ్రామానికి పార్టీలను తెచ్చిపెట్టారన్నమాట. ఇందులో ప్రజలు ఏమి సుఖిస్తున్నారు? గ్రూప్ సిస్టమ్ అన్నారు. 500 మంది ఉన్న గ్రామానికి పంచాయితీ అన్నారు. ప్రతిగ్రామంలోను రెండు పార్టీలు తయారైనాయి. ఒకరు పన్నులు వేయాలంటే మరొకరు వద్దు అంటున్నారు. ఎన్నికలలో కొట్టుకుంటున్నారు. అల్లకల్లోలం అవుతోంది, గ్రూప్‌సిస్టమ్ 5000 వరకు పెడితే కొంతవరకు బాగుటుందేమో, పంచాయితీ స్పెషలాఫీసరుకు అయిదు సంవత్సరములవరకు కాలపరిమితి పొడిగిస్తామని ఈలోపునే అన్నీ పూర్తి చేసుకోవాలనే పద్ధతిలో చెప్పడం మంచిదికాదు, క్రిమినల్ అధికారాలు కూడా ఇస్తే పార్టీలు ఇంకా ఎక్కువ అవుతాయి. హత్యలు హెచ్చు అవుతాయి. తమ ఉద్యోగస్థులను కనుక్కొని ఎక్కడైనా అధ్యక్షుడు పోటీలేకుండా వచ్చాడేమో చెప్పమనండి, ప్రతిచోట తగువే, ప్రతి ఊరిలోను పార్టీలే, తండ్రికి కొడుక్కు పార్టీ; పెండ్లామునకు మొగుడుకు పార్టీ, ఈ పోటీలవల్ల ప్రజలు సుఖిస్తున్నారా? పార్టీలమూలంగా ఇల్లు కట్టుకున్నవాని మీద కేసు, అనుమతి తీసుకోలేదు కాబట్టి, వేస్తున్నారని అంటున్నారు. పడిపోయిన గోడ కట్టుకున్నాను అన్నవాడిమీద కేసు, సగం ఇల్లు పడిపోయింది,

దానిని కట్టుకుంటున్నాను అంటే అనుమతి తీసుకోలేదు కాబట్టి కేసు అంటున్నారు. ఎంతవరకని లంచాలు ఇచ్చుకుంటారు? Town Planning Act అనేది మునిసిపాలిటీలకు పెట్టాలేకాని పంచాయితీలకు కాదు, పంచాయితీలకు పెడితే ప్రజలు ఏమి అవుతారు? ఎక్కడకు పోతారు? తెలంగాణాలో నాలుగైదు వేల జనాభా ఉంటే మునిసిపాలిటీగా చేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలో 15,20 వేల వరకు జనాభా ఉన్న మేజర్ పంచాయితీలున్నాయి వీటన్నింటిని మునిసిపాలిటీలుగానైనా చేయండి, మనిషికి ముఖ్యంగా కావలసినవి గాలి, నీరు, ఈ రెండూ అయినా ఇవ్వకపోతే ఇంక ఏమిస్తారు? వేసిన పన్నులన్నీ ఇచ్చుకుంటున్నారు. గ్రామపారిశుద్ధ్యం సంగతి తీసుకుంటే చాలా అధ్వాన్నంగా ఉంటున్నది, మా పాలకొండను తీసికొనండి. సుమారు 18 వేల జనాభా ఉన్న పట్టణం. పన్నులు ఇష్టం వచ్చినట్లు హెచ్చిస్తున్నారు. పరిశుభ్రత ఎట్లా ఉన్నది అంటే ప్రతివాడు, "ఏమి గవర్నమెంటయ్యా మీది, ఇంత అధ్వాన్నంగా ఉంది" అని ముఖంమీదే అడుగుతున్నాడు. ఇప్పటికి రెండు సంవత్సరాలైనది—వాళ్ళు పెట్టుకున్న కాగితాలకు దిక్కూ దివాణమూ లేదు. పన్నులు వేశారు చూడవలసిందని ఐ. జి. కి కాగితాలు పెట్టుకున్నారు. హైకోర్టుకు రిట్లుకూడా వెళ్లాయి. ఇంతవరకు గతిలేదు. పన్నులు వేస్తూనే ఉన్నారు. పన్నులు వేస్తున్నప్పుడు చేయవలసిన పనులు చేయండి. ఏజన్సీ గ్రామం; మంచినీళ్లు కావాలి; మలేరియా, 'ఊష్ణాలు' వస్తున్నాయి, బోదకాళ్ళు వస్తున్నాయి. పంచాయితీబోర్డుకు డబ్బు కూడా కట్టారు. నాగేశ్వరరావుగారి కాలంలో గోదావరి జిల్లాకు కొంతపని చేయించారు అనుకొనండి. ఏ జిల్లాకైనా కావలసింది నీరు. జిల్లాకు ఒక పంచాయితీకైనా ఇప్పించండి. ఇదివరకు ఒకసారి చెప్పాను. మండపేటకు స్కీము పెట్టినపుడు అనుకుంటాను. పాలకొండ ఏజన్సీకి మొదటి గ్రామం; అక్కడకన్న బోదకాళ్ళు హెచ్చుగా ఉన్నాయి; 20 వేలవరకు జనాభా ఉంది; మంచినీళ్ళు లేవు; మైలుదూరములో నది ఉన్నది; దాని సంగతి చూడండి అని చెప్పాను. అప్పట్లో వెంకట్రావుగారు చేస్తామని చెప్పారు. నాగేశ్వరరావు గారితో చెప్పాము. ఇప్పటి మంత్రిగారితో చెప్పాము. కోత తీర్మానంతో నిమిత్తం లేకుండా ఈ విషయం పరిశీలించాలని మనవి చేస్తున్నాను. ప్రజల కష్టనష్టాలను చూడవలసినవి ముఖ్యంగా పంచాయితీలు, అక్కడ గ్రూప్ విధానం మీరు అమలు చేసిన తరువాత కాలపరిమితి, అధికారాలను పెంచడం చేయండి. అంతే కాని చిన్న చిన్న గ్రామాలలో పంచాయితీ బోర్డులు పెట్టి తగవులు పెంచవద్దని కోరుతున్నాను. జిల్లాబోర్డుల విషయంలో ఎవరినైనా వేస్తేతప్ప కలెక్టరు చేతులలో బాగుపడవని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

*శ్రీ టి. బాలయ్య (గుంటూరు): అధ్యక్షా, ఈ సంవత్సరము లోకల్ బోర్డు డిమాండును సభముందు పెట్టినందుకు మా నాయకులైన ముఖ్యమంత్రి

గారిని నేనభినందిస్తున్నాను. స్థానిక స్వపరిపాలనా శాఖామంత్రి దీని విషయంలో ఎక్కువ శ్రద్ధతీసుకుని యీ డిమాండును చర్చకు పెట్టవలెనని కోరినట్లు తెలిసింది. లోకల్‌బోర్డ్సు విషయంలో వారు అనుభవశాలురు. వారి ఆధ్వర్యంలో స్థానిక స్వపరిపాలనా సంస్థలు మంచిలాభము పొందగలవని నేనాసిస్తున్నాను. 1920 వ సంవత్సరము దరిదాపుల చేయబడిన మునిసిపల్ చట్టము ఎప్పటికప్పుడు ఎన్నెన్నో మార్పులకు లోనైనది. చైర్మన్‌లకున్న అధికారాలు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరులకున్న అధికారాలు ఎప్పటికప్పుడు మార్చడము జరిగినది. ఈనాటికిది చినిగిన గంపగా తయారైంది. ఎప్పటికప్పుడు మాసికలు వేస్తూ దీనికి ఎన్నో సవరణలు చేశారు. మద్రాసు ప్రభుత్వంవారు దివాన్ బహదూర్ రత్నసభాపతి మొదలియార్‌గారి అధ్యక్షతన ఒక కమిటీవేసి యీ చట్టాన్ని సవరించదలచారు. ఆ కమిటీవారి నివేదికవచ్చింది. ఐతే దానిని అమలు పరచక ముందే ఆంధ్రరాష్ట్రం విడిపోయింది. మద్రాసు రాష్ట్రప్రభుత్వము వారుకూడా ఆ నివేదికను ఏ కారణంవల్లనో అమలు పరచలేదు. మునిసిపల్ ఆక్టును సమగ్రంగా పరిశీలించి ఒక కొత్త శాసనాన్ని క్షుణ్ణంగా తయారు చేయవలెననిమనవి చేస్తున్నాను. చైర్మన్ హక్కులు, కమీషనర్ హక్కులు నిర్ధారణ చేస్తేనేకాని అడ్మినిస్ట్రేషన్ బాగుగా జరగదని నా అనుభవమునుబట్టి తెలియ చేస్తున్నాను. మన ప్రభుత్వమువారుకూడా అనుభవజ్ఞులైన చైర్మనులను ఉద్యోగులనుచేర్చి ఒక కమిటీని ఏర్పాటుచేసి ఒక కొత్త చట్టాన్ని ప్యాస్‌చేయగలరని ఆశిస్తున్నాను.

ఎంక్రోచ్‌మెంటుకు సంబంధించిన ఒక శాసనం కొత్తగా అమలులోనికి వచ్చింది. మునిసిపాలిటీలో ఎంక్రోచ్‌మెంట్సు ఉన్నట్లయితే వాటిని తొలగించుటకు ఈ చట్టముద్వారా వీలుఉన్నది. ఐతే ఎంక్రోచ్‌మెంట్సును తొలగించినపుడు ఆక్రమణదారులకు వేరు ప్రదేశాలు చూపించవలెనని ఒక జీ. ఓ ఉన్నది. మునిసిపాలిటీకి చెందిన స్థలంలో ఎవరైనా ఒక గుడిసె వేసుకున్నట్లయితే దానిని తొలగించుటకు మునిసిపాలిటీకి అధికారమున్నప్పటికీ ఆ స్థలాన్ని ఆక్రమించిన వారికి వేరుచోటు చూపించవలసిన బాధ్యత మునిసిపాలిటీ వారిమీద ఉన్నది. ఈ జి. ఓ. ఒక భూతమో, దేముడో, దెయ్యమో అన్నట్లుగా తయారైంది. ఇట్టి జి. ఓలను రద్దుచేసి ఎంక్రోచ్‌మెంటు ఆక్టును పునరుద్ధరణచేయమని కోరుతున్నాను. కొంచెం ధైర్యంతో ఎంక్రోచ్‌మెంట్సు విషయంలో ప్రభుత్వంవారు ఒక విస్పష్టమయిన విధానాన్ని అనుసరించాలి. ఇప్పుడు మ్యునిసిపాలిటీగాని జిల్లాబోర్డుగాని ఎంక్రోచ్‌మెంటు విషయంలో నోటీసిచ్చిన ఆ ఆసామి వెంటనే మున్సిఫ్‌కోర్టుకో, హైకోర్టుకో పోతున్నాడు. కోర్టువారు వెంటవే ఇంజక్షను ఆర్డరులు జారీచేస్తున్నారు. ఒక మార్కెటులో కూరగాయలు అమ్మడానికి స్పష్టమైన కండిషనులుతో పాటపాడినా ఒక వ్యక్తి కాఫీ హోటలు పెట్టికున్నాడు. దానిని తీసివేయమని మునిసిపాలిటీవారు కోరగా కోర్టువారు

ఇంజక్షన్ ఆర్డరు ఇచ్చారు. ఎంక్రోచిమెంటు ఆక్టును అమలు చేయాలంటె ఇట్టి అడ్డంకులు ఉండరాదు. కోర్టువారు ఏవిధమయిన జోక్యం కలిగించుకోని విధంగా యీ ఆక్టును నిర్దుష్టమయిన పద్ధతిలో తయారుచేస్తేనేతప్ప పట్టణములు శుభ్రంగా ఉండవని మనవిచేస్తున్నాను. ఇక నా స్వవిషయంగురించి చెబుతాను. గుంటూరులో వాటరుసప్లయి స్కీము అమలుచేశారు. రేపు మాపు అంటూ మూడు సంవత్సరములయినప్పటికి ఇంకను దానిని మునిసిపాలిటీ వారికి స్వాధీనం చేయలేదు వచ్చేది ఎండాకాలం. గుంటూరులో మంచినీటి పరిస్థితి ఎలా ఉంటుందో మంత్రిగారికి స్వానుభవమే అనుకుంటాను. అందువల్ల దీనిని వెంటనే మునిసిపాలిటీవారికి స్వాధీనం చేసినట్లయితే మంచినీటి సరఫరా సక్రమంగా జరిగేట్లు మునిసిపాలిటీవారు ఏర్పాట్లు చేయగలరని మనవిచేస్తున్నాను.

గుంటూరుపట్టణంలో డ్రయినేజి పథకం అమలుపరిచే విషయంలోకూడ శ్రద్ధవహించవలెనని మంత్రిగారిని కోరుతున్నాను. అడ్మినిస్ట్రేటివ్ శాంక్షను ఇచ్చి యీ బడ్జెటులో కొంత ఎలాటుమెంటు చూపమని కోరుతున్నాను. ఏదో విధంగా దీనిని అమలుపరుస్తామని మంత్రిగారు హామీఇచ్చారు. దానిని కార్య రూపంలో పెట్టమని నేను వారిని ప్రార్థిస్తున్నాను.

మ్యునిసిపలు సిబ్బందికీనాడిస్తున్న జీతాలు చాలాతక్కువ. వారికి సెంట్రల్ గవర్నమెంటు స్కేల్సు ఇచ్చి కడుపునిండా తిండితినేట్లు చేయమని కోరుతున్నాను.

అచ్చంగా స్త్రీలే నిర్వహిస్తున్న పంచాయితీ బోర్డులు కొన్ని ఉన్నాయన్నారు. రేపు ఏర్పడబోయే లెజిస్లేజివ్ కౌన్సిలుకు స్త్రీలనుమాత్రమే ఎన్నుకునేట్లు చేసినట్లయితే చాలాబాగుంటుందని హడావిడి గందరగోళంలేకుండా చట్టాలుచేసే అవకాశం కలుగుతుందని నేనాశిస్తున్నాను. కనుక ఆవిధంగా చేయమని కోరుతున్నాను.

మ్యునిసిపాలిటీలలో ఉన్న మెయిను రోడ్సును హైవేసుకు అప్పగించారు. ఇందువల్ల ఆరోడ్సు సరిగా రిపేరుచేయబడడంలేదు. ఈనాడు గుంటూరు మ్యునిసిపాలిటీరోడ్సు చూస్తే బోధపడుతుంది. మ్యునిసిపాలిటీవారు ఇతర రోడ్లను బాగుచేసినప్పటికీ మెయినురోడ్సు సరిగాలేక గుంటలతోఉండడంవల్ల వారిమీద రిమార్కులు వ్రాయుటకవకాశం ఏర్పడుతున్నది. హైవేసు డిపార్టుమెంటువారు యీ రోడ్లను చూడడంలేదు. ఇదేవిధంగా ఇతర మ్యునిసిపాలిటీలలో కూడ జరుగుతున్నది. ఇందువల్ల మ్యునిసిపల్ కౌన్సిలువారు అపనిందల పాలుకావలసి వస్తున్నది. మెయినురోడ్సుపై ఉండే ఎంక్రోచ్‌మెంట్సు విషయంలో మునిసిపాలిటీవారు జోక్యంకలిగించుకోరాదనే జి. వో. ఉన్నది.

కాన మెయినురోడ్లును మ్యునిసిపాలిటీల అధీనంలో ఉంచమని కోరుతున్నాను. అప్పుడే స్థానిక స్వపరిపాలన నిరాటంకముగా కొనసాగగలదని మనవి చేస్తున్నాను. ఇట్టి ఆటంకాలున్నందున, మ్యునిసిపాలిటీలలో పార్టీలున్నాయి కాబట్టి, పనులు జరగుటలేదని కమిషనరు తప్పుకోవడానికి వీలుంటుంది. కాబట్టి ఎంక్రోచ్ మెంట్సు విషయంలో మ్యునిసిపాలిటీలకు అధికారాలుంటేనేకాని పట్టణాలను పరిశుభ్రంగాను, అందంగాను, ఉంచడం సాధ్యంకాదని మనవి చేస్తున్నాను.

విద్యావిషయంలో కనీసం మ్యునిసిపాలిటీలలోనయినా 5 వ తరగతి వరకు కంపల్సరీ ఎడ్యుకేషను ఏర్పర్చవలెనని కోరుతున్నాను. మనరాష్ట్రంలో ఉన్న 40 మునిసిపాలిటీల్లో నిర్బంధ ప్రారంభవిద్య అమలుజరిపినట్లయితే వచ్చే 5 ఏండ్లలో నూటికి 25 - 30 మంది విద్యావంతులు కాగలరని కనీసం చాకలిపద్దులు వ్రాసుకునే తెలివితేటలయినా వారికి కలుగుతాయని మనవి చేస్తున్నాను. నేను చేసిన సూచనలను మినిస్టరుగారు సహృదయంతో ఆలోచిస్తారని ఆశిస్తున్నాను. మాయందు కరుణించి మా గుంటూరు మ్యునిసిపాలిటీలో మంచినీటివసతి, డ్రయినేజి సౌకర్యాలు కలుగచేస్తారని నమ్ముతున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం): అధ్యక్షా, స్థానిక స్వపరిపాలనను ఏరకంగా పునరుద్ధరించవలెననే విషయం ఇప్పుడు మన ఎదుట ఉన్నది. శ్రీ బల్వంతరాయి మెహతా కమిటీవారు చేసిన సూచనల ప్రకారం దీనిని మార్పు చేయబోతున్నామని ప్రభుత్వవారంటున్నారు. ఈ రిపోర్టును మన ప్రభుత్వం ఒక సాకుగా మాత్రమే తీసుకున్నది. ఎన్నో సంవత్సరాలుగా ఆంధ్రలో జిల్లా ప్రాంతాలకు ఎన్నికలులేవు. అట్టిపరిస్థితినే ఛాయపరచే నిమిత్తం బల్వంతరాయి మెహతా కమిటీ రిపోర్టును మన ప్రభుత్వం ఒక సాకుగా తీసుకున్నదనే దానిలో ఏరకమయిన సందేహాము లేదు. ఒక్కొక్క బ్లాకుకు ఒక్కొక్క కౌన్సిలు ఏర్పాటు చేయవలెననేది ప్రభుత్వ ఉద్దేశ్యంగా ఉన్నది. అయితే కొన్ని ప్రాంతాలలో బ్లాకులున్నవి. కొన్ని ప్రాంతాలలో లేవు. బ్లాకులులేని ప్రాంతాలలో యీ కౌన్సిల్సును ఏవిధంగా ఏర్పాటు చేస్తారో స్పష్టంచేయవలసిన అవసరమున్నది. పంచాయితీలకు ఎన్నుకొనబడిన సభ్యులచేత యీ బ్లాకు కౌన్సిల్సుకు పరోక్ష ఎన్నికలు జరిపిస్తామంటున్నారు. ఇది ప్రజాస్వామిక సాంప్రదాయమా అని అడుగుతున్నాను.

యీ రకంగా చేసినందువల్ల ప్రజాస్వామ్యం సంకుచితమవుతుందనీ ప్రజల నుంచి ఎన్నికఅయిన ప్రతినిధులద్వారా పరిపాలన జరగదనీ మనవిచేస్తున్నాను. ప్రజాస్వామ్య వ్యతిరేకవిధానమునకు ఇది ఒక తార్కాణము. యీ కౌన్సిల్సు చేసినటువంటి తీర్మానాలను కలెక్టర్సు సస్పెయిన్డ్ చేయవచ్చును. బలవంతరాయ్

మెహతా కమిటీలో దురదృష్టవశాత్తూ అది ఉన్నది. అది సరైన విధానము కాదు. ఇంతే కాదు. జిల్లా కౌన్సిల్సును రద్దు చేయడానికి కూడ అవకాశ మున్నది. ఇది ప్రజాస్వామ్యము అనిపించుకోదు. కౌన్సిలు ఏదైనా పొరపాటు చేస్తే చేయవచ్చును. ఆ పొరపాటును దిద్దుకోటానికి అవకాశం ఇవ్వాలి కాని ఆ రకంగా రద్దు చేయకూడదు. యీ రిపోర్టునుంచే నేను చదివి వినిపిస్తాను. **"It must have the power to make mistakes and learn by making mistakes."**

బ్లాక్ కౌన్సిల్సుకు అధ్యక్షులు రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, జిల్లా కౌన్సిల్సుకు అధ్యక్షులు జిల్లా కలెక్టరు ఉంటారు. యీ బ్లాక్ కౌన్సిల్సును ప్రజా ప్రతినిధుల పేరుతో నడిపిస్తామంటున్నారు కాని రెవిన్యూ డిపార్టుమెంటు తాలూకు పెత్తనమును తీసుకురావడానికి చేస్తున్నటువంటి తెరమరుగు ప్రయత్న మవుతున్నదని మనవిచేస్తున్నాను.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : వారు వైట్ పేపరులో డిటేల్సు చదువుకొని చెబితే బాగుంటుంది.

శ్రీ బి. శ్రీరామమూర్తి : దానిని నేను కాంట్రడిక్టు చేస్తే మంత్రిగారు అభ్యంతర పెట్టవచ్చు. కాని నేను చదవలేదని చెప్పినంత మాత్రాన అది సరైన సమాధానము కాదు. నేను వైట్ పేపరును చదివే చెబుతున్నాను. మద్రాసు ప్రభుత్వము 60, 70 పేజీల వైట్ పేపరును అచ్చువేయించి ఇచ్చారు. ఆంధ్ర ప్రభుత్వమువారు 8 పేజీలే వేశారు. ఇందులో ఎక్కువ వివరములు ఇవ్వలేదు. మంత్రిగారు ఇంకా ఎక్కువ వివరములు ఇస్తే సంతోషిస్తాము.

కాబట్టి యీ విధానము కాన్‌స్టిట్యూషన్‌కు వ్యతిరేకమని మనవిచేస్తున్నాను. కాన్‌స్టిట్యూషన్‌లోని ఆర్టికలు 40 లో స్పష్టంగా ఉన్నది. భారత దేశంలో పంచాయతీలను నిర్మాణంచేయుటకు ఇందులో ఆదేశము ఉన్నది.

**"The States shall take steps to organise village panchayats and endow them with such powers and authority as necessary to make them function as self-governments."**

**Unit of Self-Government** క్రింద తయారుచేయడానికి కాన్‌స్టిట్యూషన్‌లో ఖచ్చితంగా ఆర్టికలు ఉన్నది. కాని యీ విధానంలో సెల్ఫ్ గవర్న మెంటు ప్రశ్న లేకుండా ఉన్నది. రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్నును పెడితే సెల్ఫ్ గవర్నమెంటు కాదు. అది కాన్‌స్టిట్యూషన్‌కు వ్యతిరేకము. ఐతే ప్రభుత్వము యీ మార్పు చేయడానికి ఒక కారణమున్నది. ఇందులో ప్రధాన రాజకీయ కారణాలున్నవని మనవిచేస్తున్నాను. ప్రతి బ్లాకులోనూ పని జరుగుతున్నది. ప్రజల తాలూకు డబ్బుతో చేస్తున్న అభివృద్ధి కార్యక్రమాలు ఇవి. యీ కార్యక్రమాలు బ్లాక్ కౌన్సిల్సు చేస్తూ ఇండైరెక్టు ఎలెక్షన్సు ద్వారా కాంగ్రెసు

ప్రభుత్వ ప్రతినిధులను తీసుకువచ్చి అక్కడ జరుపుతున్న అభివృద్ధి కార్యములకు కాంగ్రెసు పార్టీకి లింకుచేసి కాంగ్రెసు పార్టీని పునఃప్రతిష్ఠించడానికి శాశ్వతముగా పాతుకోవడానికి చేస్తున్నటువంటి ఒక రాజకీయ యత్నమునకు సంబంధించిన పన్నాగమిది అని అభిప్రాయపడుతున్నాను. యీ పద్ధతి సరైనదికాదు. ఇదివరకునుంచీ జిల్లాబోర్డ్సు ఎన్నికలు జరుపుతామని పదేపదే చెబుతూవచ్చారు. ఇంతవరకూ ఎందుకు జరుపలేదు ? దానికి ఒక కారణము చెప్పారు. ఎన్నికలు జరిపితే డబ్బు ఖర్చు అవుతుందనీ, ఎన్నికలు జరుపకుండా ఆ డబ్బును ప్లానింగ్‌కు వినియోగిస్తామని చెప్పారు. ప్లానింగ్‌ను సరైన పద్ధతిలో నిర్వహించాలంటే ఎన్నికలను రద్దుచేసి తద్వారా డబ్బును మిగిల్చి ప్రణాళికా కార్యక్రమము కొనసాగించుట, టోటలిటేరియెట్ ప్లానింగ్‌విధానం అవుతుందికాని ప్రజాస్వామిక ప్లానింగ్ విధానం కాదని మాత్రం, మనవి చేస్తున్నాను. తెలంగాణాలో మూడు సంవత్సరముల కాలమునకు ఎన్నిక అయిన రిప్రజెంటేటివ్సు ఉన్నారు. ఇప్పటికి నాలుగు సంవత్సరములు ఐనప్పటికీ తిరిగి ఎన్నికలు జరిపించలేదు. ఇది సరైన విధానం కాదు. మంత్రిగారు ఇపుడే తెలియచేశారు. బ్లాకుకౌన్సిల్సు ఏర్పాటు చేయడానికి ఒక ఎమెండింగ్ బిల్లు ప్రవేశపెట్టుటకు ప్రయత్నిస్తున్నామన్నారు. బ్లాక్ కౌన్సిల్సు ఏర్పాటు చేయడానికి ఎనిమిది మాసాల క్రిందట పెట్టినా యీ వైట్ పేపరు ఉండగా—ఆలోచిస్తున్నాము. ప్రవేశపెడతాము అంటే అర్థం ఏమిటి ? ఈ రకంగా స్పెషల్ ఆఫీసరు పరిపాలన గడువును పొడిగించడమే అనే అభిప్రాయము ఇందులో ఉన్నది. నామినేటెడ్ జిల్లా.బోర్డ్సును తెలంగాణా ప్రాంతంలో పొడిగించే అభిప్రాయం ఉన్నట్లు తెలుస్తున్నది ఐతే, యీ జిల్లా బోర్డ్సు ఎన్నికలు పెట్టడానికి వెనుకాడడంలో ఒక కారణం ఉన్నది. ఎన్నికలలో జయము పొందలేమోవనే కారణము ఉన్నదని అభిప్రాయ పడుతున్నాను. ఎందుకంటే విజయవాడ, గుంటూరు ఎన్నికలలో కాంగ్రెసుకు వచ్చిన వ్యతిరేక ఫలితాలే తార్కాణము. భారతదేశంలో పురాతన పంచాయితీ పరిపాలనా విధానము విశిష్టమైనటువంటిది. దానిని గురించి రాధాకమల్ ముఖర్జీగారు ఇలా చెప్పారు.

India presents a rare and remarkable phenomenon of the State and Society-co-existing apart from and in some degree independent of eaeh other as distinct and separate units or entities as independent centres of national policy and collective life and activity.

ఈ రకంగా గ్రామాలలో సర్వ స్వతంత్రమైన విధానమే కాకుండా సమగ్రమైన పరిపాలనా విధానము అమలు జరిగే పరిస్థితి ఉన్నది. బ్రిటనువంటి పాశ్చాత్య దేశాలలో స్థానిక సంస్థలే ఎడ్మినిస్ట్రేటివ్ ఫంక్షన్సును నెరవేరుస్తున్నట్లు కనబడుతున్నది. అక్కడ పార్లమెంటు పాస్ చేసిన చట్టాలు పంచాయితీలే అమలు జరుపుతాయి. ఈ రకమైన విధానమును మనము సమన్వయపరచి

మన పంచాయితీ పరిపాలనా విధానమును రూపొందించుకోనవలసి ఉన్నది. ఇందుకు స్థానిక ప్రజల ఇనిషియేటివ్ కూడా కావాలి ప్రజలు ఉత్సాహంగా అభివృద్ధి ప్రణాళికలలో పాల్గొనే అవకాశము కల్పించాలంటే అధికారులకు పెత్తనం ఇచ్చినంత మాత్రమున సరిపోదు. ముఖ్యమంత్రిగారి ఎన్నికకు ఏ వోటరులైతే బాధ్యులై ఉన్నారో ప్రైమ్ మినిష్టరు ఎన్నికకు ఆ వోటరులే బాధ్యులై ఉంటారు. ఆ వోటరులే యీ మెంబర్సు ఎన్నికలకు వోటరులై ఉంటారు కాబట్టి ఇక్కడ జరుగుతున్న పొరపాట్లే బహుశా తక్కువ స్కేలులో ఆ గ్రామాలలో జరిగితే జరుగవచ్చు. పొరపాట్లు ఉన్నప్పుడు వాటిని సరిదిద్దుకుని ముందుకు పోయేటట్లు ఈ విధానం ఉండాలనీ ప్రజా ప్రతినిధుల ద్వారానే అక్కడ కూడా పరిపాలన జరిగేందుకు యీ విధానము రూపొందించాలనీ విజ్ఞప్తి చేస్తూ ఈ అవకాశ మిచ్చినందులకు అధ్యక్షులవారికి నమస్కారములు తెలుపుతూ విరమిస్తున్నాను.

శ్రీ ఎం. బాగారెడ్డి (జహీరాబాద్) : అధ్యక్షా, పూర్వపు హైదరాబాదు నవాబుల పరిపాలనలో గ్రామాలు ఏమాత్రము అభివృద్ధి చెందలేదు. వారు ఆ కాలములో గ్రామాలను పూర్తిగా నిర్లక్ష్యముచేసి హైదరాబాదు, సికిందరాబాదు ముఖ్యనగరముల అభివద్ధికొరకే ప్రత్యేక్యముగా శ్రద్ధవహించి కృషి చేసినారు. గ్రామాలలో విద్యాసౌకర్యములూ, వైద్యసహాయమూ ఏమీలేదు. గ్రామముల విషయంలో తక్కువ శ్రద్ధచూపించేవారు. హాస్పిటల్సుకాని, స్కూల్సుకాని, కాలేజీలుకాని అన్నీ యీ సిటిలోనే పెట్టారు. అందువల్ల తెలంగాణా ప్రాంతములోని గ్రామ ప్రజలకు ఏమీ సౌకర్యములు లేకుండా పోయినాయి. వారి అభివృద్ధికి కావలసిన శ్రద్ధ ఆ కాలపు ప్రభుత్వము చూపించలేదు. ఇపుడు మంత్రిగారు చెబుతూ కొన్ని లెక్కలు ఇచ్చారు. పంచాయతీల పైన ఆంధ్రలో ఒక కోటిరూపాయలు ఖర్చుపెడుతున్నారు. ఇక్కడ పది లక్షలు మాత్రమే. అక్కడ 9 వేల పంచాయతీలు ఉంటే ఇక్కడ 12 వందలు ఉన్నవని తెలుస్తున్నది. గ్రామాలలో 80 శాతం జనాభా ఉంటున్నారు. ముఖ్యంగా వారే దేశాభివృద్ధికి కృషి చేస్తున్నారు. వారియొక్క మంచే దేశముయొక్క మంచిస్థితికి కారణమవుతుంది. అందువల్ల గ్రామముల అభివృద్ధికొరకు యీ ప్రభుత్వము ఎక్కువ కృషి చేయగలదని అనుకుంటున్నాను. పట్టణాలలో చదువుకొన్నవారు ఎక్కువ. పల్లెలలో విద్యాసౌకర్యములు లేవు. అందువల్ల అక్కడ చదువుకున్నవారు లేరు. అక్కడ పంచాయతీలను పెట్టినప్పటికీ అవి సక్రమంగా నడపడంలేదు. ఆ పంచాయతీ సభ్యులలో నూటికి 20 మందికి పంచాయతీ సభ్యులమనే తెలియదు. తహశీల్దార్, డిప్యూటీ డైరెక్టర్ వారి పేర్లువ్రాసి పంపారేగాని వారికి ఏమీ తెలియదు. బడ్జెట్ అంటే ఏమిటో

పంచాయతీయొక్క అధికారాలు, బాధ్యతలు చేయవలసిన పనులు అవి చాలా మంది సభ్యులకు తెలియవు. తెలపడానికి తగినంత కృషికూడా చేయలేదు.

ఒక పంచాయితీ ఇన్స్పెక్టర్‌ను మాత్రమే మూడు తాలూకాలకు ఇస్తున్నారు. గవర్నమెంట్‌నుంచి వచ్చిన కాగితాలకు జవాబులు వ్రాయటానికే ఆయన పని సరిపోతున్నది. ఈనాడు పంచాయితీలవారికి, తమకు ఉన్న అధికారాలు ఏమిటో, తమకు ఏమేమి వస్తువులు కావాలో, బడ్జెట్ ఎట్లా ప్రిపేర్ చేసుకోవాలో, తెలియకుండా ఉన్నది. అందువల్ల 1956-57 సంవత్సరంలో మెదక్ జిల్లాలోని పంచాయితీలకు ఇచ్చిన గ్రాంటు అంతా లేప్స్ అయిపోయింది, మునిసిపల్ గ్రాంటుకూడ అనుభవించలేకపోయిన పరిస్థితిఏర్పడింది. కాబట్టి, వెంటనే తెలంగాణా ప్రాంతంలో, ఒక తాలూకాకు, లేక ఒక రెవిన్యూ సర్కిల్‌కు ఒక పంచాయితీ ఆఫీసర్ ఉండేటట్లు చేయాలని కోరుతున్నాను. పంచాయితీలయొక్క బాధ్యత ఏమిటో పంచాయితీలవారికి తెలయజెప్పేందుకు ఆ ఆఫీసర్స్‌ను వేయాలని కోరుతున్నాను.

పూర్వము, మూడు సంవత్సరాలకు ఒకసారి మునిసిపల్ ఎలక్షన్స్ జరిగేవి. ఇప్పుడు 5 సంవత్సరాలకు ఒకసారి ఎన్నికలు జరుగుతున్నవి. దీనివల్ల సందేహాలు, సంశయాలు ప్రజలలో కలుగుతున్నాయి. మంత్రిగారు యీ సంవత్సరం ఎలక్షన్స్ జరిపిస్తామని అంటున్నారు. ఇది సంతోషకరమైన విషయము.

కొత్తగా స్టేట్స్ రి-ఆర్గనైజేషన్ జరిగిన తర్వాత, నారాయణ ఖేడ్ జహీరాబాద్ తాలూకాలు మెదక్ జిల్లాకు వచ్చినవి. ఆ రెండు తాలూకాలకు డిస్ట్రిక్ట్ బోర్డులో ఇంతవరకు ప్రాతినిధ్యంలేదు. మేము దానినిగురించి అడిగితే "కొత్తగా జిల్లా బోర్డులు వస్తున్నాయి, అప్పుడే వైట్‌పేపర్ వచ్చేసింది" అని అంటున్నారు. కొత్త విధానం రావటానికి ఆరు నెలలో, నాలుగు నెలలో పడుతుంది. అటువంటి సమయంలో యీ రెండు తాలూకాలకు డిస్ట్రిక్ట్ బోర్డులో ఏ విధమైన ప్రాతినిధ్యం లేకుండా ఉంచటం అన్యాయము. వాటికి ప్రాతినిధ్యం లేకపోవటంవల్ల అక్కడ జరపవలసిన డెవలప్‌మెంట్ వర్క్స్ జరగటానికి అవకాశం లేకుండా పోతోందని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. డిస్ట్రిక్ట్ బోర్డునుండి ఆ తాలూకాలకు ఖర్చుపెట్టవలసిన డబ్బు ఖర్చుపెట్టబడటంలేదు. కొత్తగా జిల్లా బోర్డులు ఏర్పడేవరకు, మెదక్ డిస్ట్రిక్ట్ బోర్డులో యీ రెండు తాలూకాలకు ప్రాతినిధ్యం ఇవ్వాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

మెదక్ జిల్లాలో కొవ్వూరు అనే గ్రామం ఉన్నది. అక్కడ జనాభా పదివేలు ఉంది. అది హైదరాబాదు బొంబాయి పోయే హైవేస్ రోడ్డుకు నాలుగు మైళ్ళ దూరంలో ఉంది. ఆ నాలుగు మైళ్ళ రోడ్డు వేయాలని 20

సంవత్సరాలనుండి ప్రజలు కోరుతున్నారు. జిల్లాబోర్డువారు 50 వేల రూ.లు ఆ రోడ్డు నిర్మాణంకొరకు ఇవ్వటం జరిగింది. కాని దురదృష్టవశాత్తు, ఆ డబ్బుతో రెండు మూడు ఫర్లాంగులకన్నా ఎక్కువ రోడ్డు కాలేదు. ప్రభుత్వం డబ్బు ఖర్చు అయింది. పోయిన సంవత్సరంకూడ ప్రభుత్వం చాలా ఉదారత్వం చూపించి 14 వేల రూపాయల గ్రాంటు ఇచ్చింది. కాని ఆ 14 వేల రూపాయలలో నాలుగు వేల రూపాయల పనికూడ జరగలేదు. అడవిలేని ప్రాంతంలో అడవి నరికినామని వెయ్యి రూపాయలకు ఒక బిల్లు ఇవ్వటం జరిగింది. ఇంకా పుట్టగడ్డలు తీసివేసినామని ఒక బిల్లు ఇవ్వటం జరిగింది. అక్కడ ఉన్నటువంటి లోకల్ ఇంజనీర్ మైసూరు రాష్ట్రానికి ఎలాట్ అయినారు. ఆయన పోయే టప్పుడు పుస్తకాలలో మార్పులుచేసి, ఒక ఫీట్ ఉన్నదానికి రెండు ఫీటు లని, రెండు ఫీటులున్నదానికి మూడు ఫీటులని యీ తీరుగా కరక్షన్ చేసినారు. ఆయన రెండు మూడు వేల రూపాయలు ఒక కంట్రాక్టరుకు ఎక్కువగా ఇచ్చారు. "నేను కర్ణాటక ప్రాంతానికి పోతున్నానుగనుక, ఆంధ్రప్రదేశ్‌లో నేను ఏమైనా చేయవచ్చును" అని ఆయన అనుకొన్నాడు. కాని అటువంటి అవకాశాలు ఆయనకు లేవనుకొంటాను. ఆయన మైసూరు పోయినంతమాత్రాన భారతదేశం వదలిపోయినట్లు కాదు. ఈ ప్రభుత్వం అటువంటి వ్యక్తులను, అటువంటి కంట్రాక్టర్లను విచారించటానికి ప్రయత్నం చేయగలదని ఆశిస్తున్నాను. ఆ కంట్రాక్టరుకు ఇచ్చిన టెండరు అందరికన్నా చాలా హైయస్ట్‌గా ఉన్నది. కాని ఆ లోకల్ ఇంజనీర్ డిస్క్రిపన్ యూజ్ చేసి "మొదలు ఆయనకు చాలా నష్టం కలిగింది, అందువల్ల ఆయనకు కంట్రాక్టు ఇస్తే సమంజసంగా ఉంటుందని" చెప్పారు. ఈ విధంగా అన్యాయాలు జరగకుండా మంత్రిగారు, డిపార్టుమెంటువారు చూడాలని కోరుతున్నాను. మేము మంత్రిగారికి ఒక మెమోరాండం సమర్పించినాము. మా జిల్లాకు సంబంధించిన కాంగ్రెస యం. ఎల్. ఎ. ఒక మంత్రిగారికి ఒక మెమోరాడం సబ్‌మిట్ చేశారు. ఒక సబ్ ఇన్‌స్పెక్టర్ పోలీసుకు వ్యతిరేకంగా చేస్తున్నారు అని ఇవ్వటం జరిగింది ఆ మినిస్టర్ గారు దానిని ఐ జి. పి. తాహిఖాల్ కొరకు పంపారు. ఐ. జి. పి డి. ఐ. జి. పి. కు, డి. ఐ. జి. పి. డి. యస్. పి. కు, డి. యస్. పి. డిప్యై. యస్. పి. కు డిప్యై. యస్. పి. సర్కిల్ ఇన్‌స్పెక్టరుకు, సర్కిల్ ఇన్‌స్పెక్టరు అదే సబ్ ఇన్‌స్పెక్టర్‌కు పంపించటం జరిగింది. ఆ సబ్ ఇన్‌స్పెక్టరు యం. ఎల్. ఏ. గారిని పిలిచి......

మిస్టర్ స్పీకర్ : మీరు పోలీసుకు సంబంధించి మాట్లాడుతున్నారు. లోకల్ సెల్ఫ్ గవర్నమెంట్ గురించి మాట్లాడండి.

శ్రీ ఎం. బాగారెడ్డి: ఆ విధంగా ఆయనను సబ్ ఇన్‌స్పెక్టర్ పిలిచి "ఇట్లా వ్రాశారేమండీ, నాతో చెబితే నేనన్నా చూసేవాడిని, నాకు ఎందుకు చెప్పలేదు, అప్లికేషను వ్రాసేవిధమన్నా చెప్పేవాడిని" అన్నారు. ఆ రోడ్డు విషయంగురించి మేముకూడ ఒక మెమోరాండం మినిస్టర్‌గారికి సబ్‌మిట్ చేశాము. అది ఛీఫ్ ఇంజనీరుగారికి వ్రాశారు. చీఫ్ ఇంజనీరు సూపరెంటెండింగ్ ఇంజనీరుకు వ్రాశారు. వారు, లోకల్ ఇంజనీరు కలిసి అక్కడికిపోయి చూసి వచ్చారు. అక్కడి కంట్రాక్టరు లోకల్ ఇంజనీరుకు ఎగెనిస్టుగా వెళ్లారని అంటున్నారు.

పైడిగుమ్మల అనే గ్రామంలో ఒక వ్యక్తికి జిల్లాబోర్డువారు 12 వేల రూపాయలు హాస్పటల్ కట్టుటకు ఇచ్చారు. ఆ వ్యక్తి సోషల్ సర్వీసునుండి 4 వేల రూపాయలు తీసుకొన్నాడు. మొత్తం 16 వేల రూపాయలు తీసుకొని అక్కడ రెండు వందలు, నాలుగు వందలు రూపాయల పనిచేసి, రెండు సంవత్సరాలనుండి హైదరాబాదులో కూర్చున్నాడు. ఆ విషయాన్ని నేను ఇదివరకే జిల్లా అధికారులకు మనవిచేశాను కాని వారు ఇంతవరకు ఎటువంటి చర్య తీసుకోలేదు. ఆవిధంగా 12 వేల రూపాయలు దుర్వినియోగము అయినట్లు తెలుస్తున్నది. లక్షల రూపాయలు నష్టము కాలేదని, దీనిని గురించి శ్రద్ధ తీసుకోవలసిన అవసరం లేదని ప్రభుత్వం భావించదని అనుకొంటాను. ఎందుకంటే, యీవిధంగా దుర్వినియోగం అయ్యే డబ్బు కలుపుకొంటూపోతే లక్షల రూపాయలు అవుతాయి. కాబట్టి యీ విధంగా డబ్బు దుర్వినియోగం కాకుండా మంత్రిగారు శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. మంత్రిగారు స్వయంగా వచ్చి చూడండి. నేను చెప్పినవి అబద్ధమైతే, మా మీద చర్య తీసుకొన్నా అందుకు సిద్ధంగా ఉన్నాము. కాబట్టి మంత్రిగారు యీ విషయాలన్నీ శ్రద్ధగా గమనించి ఇటువంటి లోపాలు జరగకుండా చేయవలసిందిగా కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

**श्री रंगनाथ राव (आदिलाबाद) :** माननीय अध्यक्ष जी। लोकल सेल्फ़ गवर्नमेंट के मिनिस्टर साहब ने माननीय गोपालराव एकबोटे की सूचना पर आज जो डिमेंड लोकल सेल्फ़ अडमिनिस्ट्रेशन के सम्बन्ध में हमारे सामने रखा है, उसके लिए मैं उनका खास तौर पर अभिनंदन करता हूँ। मगर साथ ही साथ जिस मक़सद से यह डिमेंड रखा गया है, उसके लेहाज से उसके एडमिनिस्ट्रेशन उसके फ़ाइनांसेस और उसकी पालिसी को देखने के बाद मुझे बहुत ही अफ़सोस से कहना पड़ता है कि इस बारे में हमें जितनी खुशी होनी चाहिए थी, वह नहीं हो सकी। बहुत दिनों से, आजादी मिलने से पहले से एक खास काम लोकल सेल्फ़ गवर्नमेंट के सामने था। उसके एटॅनॉमिक और डेमोक्रेटिक फ़ंगशंस के लेहाज से हमारे कारपोरेशन एक्ट, म्युनिस्पल एक्ट, पञ्चायत एक्ट जो हैं, उन्हें देखने के बाद वह बहुत ही कमजोर मालूम होते हैं। और पूरी दुनिया में जो लोकल बाडीज हैं, उनके लेहाज से हमारे पास जो एक्ट्स है,

उन में बहुत सी ख़ामियाँ हैं। दूसरी तरफ़ उनको काफ़ी अधिकार दिया जाना है। आज हैदराबाद और सिकन्दराबाद में म्युनिस्पल कारपोरेशंस एलेक्टेड बाडीज़ है, उस में पूरे लोगों के चुने हुए लोग लिये गये है। लेकिन वहाँ पूरे एकज़िक्युटिव पावर्स लोगो के हाथो में नहीं है। उन में गवर्नमेंट के अपांइटेड डुमिनियन केडर सर्विस के लोग हैं। जिसकी वजह से यह कमेटीज़ और एलेक्टेड बाडीज़ को वह रिसपांसिबल नहीं है जिस सर्विस में वह है अगर वह उसी के हो, तो लायल रह सकते है। इस लिए हमें इस नतीजे पर आना पड़ता है कि लोकल सेल्फ़ गवर्नमेंट का काम जिस ढङ्ग से चलना चाहिए नही चल रहा है। उस में पूरी तबदीली आनी चाहिए। अभी बहुत से दोस्तो ने बताया कि जो एक्ट्स हैं उनके सेकशंस का बराबर इंप्लीमेंटेशन नहीं हो रहा है। और इसकी वजह से बहुत ही मिसमेनेजमेंट हो रहा है। इस सिलसिले में मेरी एक सूचना है। इसके बहतर एडमिनिस्ट्रेशन के लिए गवर्नमेंट और लोकल बाडीज़ में कोआरडिनेशन होना चाहिए। एक स्टेट लोकल बाडीज़ एडवाइज़री कमेटी होनी चाहिए, जिस में लोकल बाडीज़ के रिप्रेज़ेन्टेटिव रहे। और दूसरे एम. एल. एज़ भी रहें। इस कमेटी के चेरमेन हमारे लोकल एडमिनिस्ट्रेशन के माननीय मंत्री हो। ताकि लोकल बाडीज़ और गवर्नमेंट में जो मिसअनडरस्टेंडिंग ( Misunderstanding ) हैं, वह ख़तम हो सके। वह कोआर्डिनेटिव लिंक के तौर पर रहे और सूचनाएँ देती रहे। और एडमिनिस्ट्रेशन पर भी सूचनाएँ दें ताकि एडमिनिस्ट्रेशन ठीक तौर पर चले।

दूसरी अहम चीज़ यह है कि जब तक लोकल बाडीज़ की फ़ाइनांशल कण्डीशन ठीक तौर पर न हो कोई लोकल बाडी ठीक तौर पर नहीं चल सकती। ख़ास तौर पर तेलङ्गाना एरिया में उनके रेवेनिव सोरसेस ( Revenue Sources ) प्रापरटी टेक्स, वाटर टेक्स, इनटरटेनमेंट टेक्स और प्रोफ़ेशन टेक्स यही चार चीज़े हैं। मगर इस में भी परसूँ ही मद्रास इनटरटेनमेंट टेक्स लाया जा रहा है। उसकी वजह से जहाँ तक मेरा ख़याल है, म्युनिस्पालटीज़ के रेवेनिव में बहुत कुछ फ़र्क़ होनेवाला है और उनकी इनकम कम हो जाने का डर है, जिसकी वजह से लोकल बाडीज़ जो कुछ एमिनिटीज़ देना चाहेंगे और जो दे रहे हैं वह ठीक तौर पर नहीं दे सकेंगे। इस लिए मैं गवर्नमेंट से रिकवेस्ट करता हूँ कि लोकल बाडीज़ के फ़ाइनांसेस को मज़बूत करें। इसके लिए मैं कुछ सूचनाएँ दे रहा हूँ। इस बारे में ख़ास तौर पर टेकसेशन इंक्वाइरी कमीशन ने भी रिकमेंड किया है। वह यह कि कमर्शियल अण्डरटेकिंग्स ( Commercial undertakings ) जैसे कुछ सर्विसेस हैं, एलेक्ट्रिसिटी, आर. टी. डीं. वग़ैरा जिन लोकल बाडीज़ में वह हैं, उनके मेंनटेनेंस (maintenance) के बाद जो कुछ आमदनी उन से होती है वह वहाँ की म्युनिस्पालटीज़ और पञ्चायतों को दी जानी चाहिए, ताकि वह अपने फ़ंगशंस को ठीक तौर से चला सकें साथ ही साथ यहाँ तेलङ्गाना एरिया में डुमीनियन केडर के तहत जो सेंट्रल चार्जेस गवर्नमेंट लेती है वह आमदनी का $12\frac{1}{2}\%$ है। यह बहुत ज़्यादा है। हालांकि आंध्र एरिया में यह नहीं है। कम से कम अब जो एक्ट लाया जा रहा है उसके ज़रिये इन चार्जेस को नहीं लेना चाहिए। या कम से कम इस परसन्टेज को कम करना चाहिए।

दूसरी चीज़ प्रोटेकटेड वाटर वर्कस के बारे में है। हमारा उद्देश्य यह है कि भारत देश में हर जगह पीने का पानी मिलना चाहिए ताकि हेल्थ ठीक हो। और

सेनिटेशन पाइन्ट् और हेल्थ पाइन्ट से लोकल बाडीज़ पर इसकी भारी ज़िम्मेदारी आती है। लेकिन हम देखते है कि बजेट में प्रोटेकटेड वाटर स्कीम के तहत कोई ख़ास अमाउंट सेंगशन नहीं हुआ है। मै कहूँगा कि जितनी भी अमाउंट संगशन हुई है वह पूरी तौर पर ख़र्च होनी चाहिए। ख़ास तौर पर वहाँ जहाँ पानी की तकलीफ़ है। गवर्नमेंट की जब ग्रांट (grant) मिलती है तो कम से कम उतना काम तो होना चाहिए।...

( Bell )

శ్రీ డి. హనుమంతరావు (జగతియాల్): అధ్యక్షా, చాలా దినముల తరువాత నాకు మాట్లాడటానికి అవకాశ మిచ్చినందులకు అధ్యక్షులవారికి నేను ప్రత్యేకముగ నా ధన్యవాదములు అర్పించుకుంటున్నాను. ఈ డిమాండును ప్రతిపాదిస్తూ గౌరవనీయులైన మంత్రిగారు Local Administaration కు సంబంధించిన వ్యవహారములు, దానియొక్క ప్రాముఖ్యతనుగురించి చెప్పారు. ఇప్పుడు మనకు ఉన్న Welfare State లో Administration కు సంబంధించిన ప్రస్తుతవిధానమును మార్చబోతున్నామని మంత్రిగారు చెప్పారు. ఆమార్పులను గురించి పలువురు సభ్యులు పలువిధములుగ సూచనలుచేస్తూ మాట్లాడారు. నాకు తెలిసినంతమటుకు పంచాయితీ బోర్డులనుగురించిగాని, జిల్లాబోర్డులను గురించిగాని కొన్ని సూచనలు చేయదలుచుకున్నాను పంచాయితీలు అనేవి చాలా కాలముగా, పూర్వము బ్రిటిషువారి హయాము ఉన్నప్పటినుంచి ప్రతి గ్రామములోను ఒక్కొక్క పంచాయితీ ఏర్పాటుచేయబడినది. అవి ఇంతవరకు ఏ ప్రతిష్ట, విశిష్టత సంపాదించుకున్నవో అందరికీ తెలుసును. ఇప్పుడు వాటి యొక్క పరిపాలనలో మార్పు తీసుకురావాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదని అన్నారు. పంచాయితీబోర్డులను యిప్పుడు పునరుద్ధరించాలని అంటే, మన Indian Constitution క్రింద కొన్ని గ్రామ పంచాయితీలను చేర్చి ఒక యూనిటుగా చేయటానికి అంగీకరించినది. మనకు స్వరాజ్యము ఏర్పడి యిప్పటికి పది సంవత్సరములైనది. పంచాయితీల నిర్వహణ ఏమాత్రము తృప్తికరముగలేదని చెప్పకతప్పదు. గనుక వీటిని పునరుద్ధరించడము అవసరమే. అయితే ఇది యేవిధముగచేయాలి అనేదే సమస్య. ఇప్పుడు దానిని మనము ఆలోచించవలసియున్నది. ఆంధ్రలో ఎన్నికలద్వారా పంచాయితీలను ఏర్పాటు చేసి నడుపుతున్నారు. కాని తెలంగాణాలో nomination పద్ధతిమీద ఏర్పాటు చేయబడినవి. ఇది Fullfledged Democracy క్రిందకు రాజాలవు. జిల్లాబోర్డులు కూడ అదేవిధముగ nomination పద్ధతిమీదనే నడపబడుతున్నవి. ఇప్పుడు మనము ఆంధ్ర ప్రదేశ్ ఏర్పాటుచేసుకున్నాము. అది ఏర్పడి యిప్పటికి దాదాపు 16 నెలలు కావచ్చింది, ఇంతవరకు వీటిలో ఏలాంటిమార్పు లేకుండానే అదేపద్ధతిమీద నడపబడుతున్నవి. ఇప్పుడు Integration అనేది ప్రభుత్వము take up చేస్తున్నది. ఇదివరదాకా ఈ జిల్లాబోర్డులను అసలు ఉంచనేకూడదని అన్నారు, కాని యిప్పుడు మరల Block Councils ను

ప్రతిజిల్లాకును ఏర్పాటు చేయబోతున్నామని మంత్రిగారు చెబుతున్నారు. కాని పంచాయితీలకు సంబంధించిన శాసనాలు యిరుప్రాంతాలకు ఉన్నవి. ఈ రెండింటిని సమన్వయపరచి, క్రొత్తగా పంచాయితీ రాజ్యము కావాలని అంటున్నాము గనుక, ప్రత్యేకంగా ఒక శాసనమును తయారుచేసుకోవలసి ఉన్నది. ప్రస్తుతము పంచాయితీలకు సంబంధించినంతవరకు సరియైన రూల్సు లేకపోవడమువల్ల, వీటికి సక్రమంగా నడపలేకపోతున్నామని మంత్రిగారే చెప్పారు. ప్రస్తుతము మనము ఏర్పాటుచేసుకున్న Democratic set up కు అనుగుణ్యముగ, మనము పంచాయితీలద్వారా గ్రామ పంచాయితీ రాజ్యమును త్వరలో ఏర్పాటుచేసుకోటానికి రూల్సును త్వరలో మార్చుకోకపోతే, మనము అది ఏర్పడకుండా అడ్డంకులు కలుగజేసినవార మవుతాము. కాబట్టి ప్రభుత్వం ఏదో రెండు వేల జనాభా అని, మూడు వేల జనాభా అని, పరిమితి పెట్టి పంచాయితీలను ఏర్పాటుచేసి, ముఖ్యంగా welfare activities అన్నీ ఆ పంచాయితీలద్వారా నిర్వహింపజేయాలి. అంతవరకైనా వాటికి అవసరమైన డబ్బును ప్రభుత్వానికి వచ్చే Land Revenue లో నుంచి యిచ్చేటట్లు ఏర్పాటు చేయాలి. Mehta గారి కమిటీగూడ పంచాయితీలకు Land Revenue లోనుంచి 50% కేటాయించాలని సిఫార్సు చేసింది. ఆ సిఫార్సులు ప్రభుత్వము అంగీకరించి ఆ ప్రకారము ఏర్పాటుచేయాలని అంటున్నాను.

తెలంగాణాలో Revenue Collection కు సంబంధించి పంచాయతీలకు యిచ్చిన అధికారాలలో కొన్నింటిని రద్దుచేయవలసియున్నది. గ్రామపంచాయతీలు professional tax వసూలుచేయడంవలన చాలాచిక్కులు ఏర్పడుతున్నాయి. ఈ పంచాయతీలంటేనే ప్రజలకు అసూయకలుగుతోంది. కాబట్టి అటువంటివాటిని తీసేసి, House Tax, ఇంకా, land revenue 50% పంచాయితీలకు వచ్చేలాగ మెహతా కమిటీ సిఫార్సులను అంగీకరించి గ్రామాలలోని welfare activities కు దోహదం కలిగించాలని మనవిచేస్తున్నాను. పంచాయతీలకు criminal civil powers కూడా యిస్తే బాగుంటుందని మంత్రిగారు తమ ఉపన్యాసంలో చెప్పారు. కాని యిప్పటి పరిస్థితులలో పంచాయతీలకు క్రిమినల్, సివిల్ అధికారాలు యిచ్చినట్టయితే చాలా చెడ్డపరిణామాలకు దారి తీస్తుంది. ఈనాడు చాలా గ్రామాలలో illiteracy ఉన్నది. అక్కడి ప్రజలచే ఎన్నుకోబడి, ఏర్పాటయిన పంచాయతీలకు క్రిమినల్, సివిల్ అధికారాలు సంక్రమింపచేసినట్లయితే గ్రామాలలో బీభత్సం కలుగుతుంది, అరాచకం ఏర్పడుతుంది. కాబట్టి యిప్పుడు ఆ సంకల్పాన్ని విరమించాలని మనవి చేస్తున్నాను. పంచాయతీల ఎన్నికలసందర్భంలో political parties కలుగజేసుకొనుటవలన strikes - కల్లోలాలు జరుగుతున్నాయి. కాబట్టి అన్నిపార్టీలూ ఒక convention ఏర్పాటుచేసుకుంటే మంచిదని నేను ఈ House లో

సవినయంగా మనవిచేస్తున్నాను. గ్రామపంచాయతీ ఎన్నికలలో ఏపార్టీకూడా ప్రమేయం కలిగించుకోకూడదు. పార్టీ అభ్యర్థులను నియమించకూడదు. మన Republic India లో గ్రామపంచాయతీలు unit గా ఉండాలి. అందులో ఏపార్టీ కూడా పాల్గొనకుండా మన ప్రజలకు బాధ్యత విడచిపెట్టడం మంచిది. వారే తెలివిగలవారినీ, integrity గలవారినీ ఎన్నుకొనే అవకాశం కలిగించేందుకు వీలవుతుంది. ఈవిషయాలనుబట్టి అన్నిపార్టీలవారు convention ఏర్పాటుచేసు కోవాలని మీ ద్వారా సభకు మనవిచేస్తున్నాను.

తెలంగాణాకు సంబంధించిన జిల్లాబోర్డుల సంగతి నాకు తెలుసును. ఇదివరకుఉండే District Boards అన్నీ nominated bodies. గత 10 సం. రాల నుంచి తెలంగాణాలో పనిచేస్తున్న జిల్లాబోర్డుల వ్యవహారాన్ని దృష్టిలోనికి తెచ్చుకుంటే అవి ఆదాయానికి తగినఖర్చు చేయకుండా ఉన్న డబ్బును సరిగా ఖర్చుచేయకుండా, గ్రామాలలోని ప్రజలకు సౌకర్యాలు కలిగించలేకపోయినవి. మంత్రిగారు చెప్పిన లెక్కలప్రకారమే యీ విషయం రుజువు అవుతున్నది. జిల్లా బోర్డుల ఆదాయంలో అధికభాగం ఖర్చుచేయబడుతున్నది. ఆంధ్ర ప్రాంతంలో జిల్లాబోర్డులు ఖర్చుచేసే విధంగానే యిక్కడకూడా ఖర్చుచేయ డానికి తగు చర్యలు తీసుకోవాలని మంత్రిగారిని కోరుతున్నాను. తెలంగాణాలో 1952-53 సం. నుంచి local development schemes అమలులోనికి వచ్చినవి. ఇతర రాష్ట్రాలలోవలెనే తెలంగాణాలోకూడా ఏర్పాటు చేయబడినవి. విశా లాంధ్ర ఏర్పడకపూర్వం తెలంగాణాలోని కరీంనగర్ జిల్లాకు సంబంధించినంత వరకూ చాలా ప్రోత్సాహకరమైనపనులు జరిగాయి. మొత్తం allotted money అంతా ఖర్చుచేయబడినది. కేంద్రప్రభుత్వం యిచ్చిన డబ్బుగాని, రాష్ట్రప్రభుత్వం యిచ్చిన డబ్బుగాని, జిల్లాబోర్డులు యిచ్చిన అధికభాగంకాని ఏదీకూడా lapse కాకుండా development works చేయబడినాయి. కాని గతసంవత్సరం కరీం నగర్ జిల్లాలో alloted money ని సక్రమంగా వినియోగించ లేకపోయాము. Local Government కు సంబంధించిన engineering staff అక్కడ చాలినంత లేనందువలన డబ్బు lapse అయిపోతోందని సమాధానం చెబుతున్నారు. కాబట్టి తొందరగా engineering staff ను అధికంచేసి local development schemes క్రింద జిల్లాబోర్డులకు allot చేయబడిన డబ్బును సక్రమంగా ఖర్చుచేసి ప్రజోప యోగకరమైన పనులు చేయించాలని కోరుతున్నాను. 1955-56 సం. లో local contribution 25% ఉన్నది. దానిని ఇప్పుడు 37½% కు పెంచినారు. ఇట్లా increase చేయడంవల్ల ప్రజలనుంచి ధనరూపేణాగాని, material రూపేణా గాని, శ్రమదానం రూపేణాగాని వచ్చే contribution రావడంలేదు. అందువల్ల పూర్వంవలెనే 25% మాత్రమే ఉంచాలి, ఇప్పుడు increase చేసిన 12½% ను తగ్గించాలని మంత్రిగారిని కోరుతున్నాను.

District Boards కు Block Councils ను ఏర్పాటుచేస్తే జిల్లాలు వాటంతటవే feed అవుతాయని మంత్రిగారు సెలవిచ్చారు. Local Self Government, Democracy, Decentralisation యివి మన ధ్యేయాలని ఒప్పుకొన్నాము. మన చట్టాలను సమన్వయం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాము. ఈలోపున తెలంగాణాలోని జిల్లాబోర్డులను తీసేసే ప్రయత్నం చేయకూడదు జిల్లాబోర్డులను తొందరలో అమలులోకి తెచ్చి వారికి ఉన్నడబ్బు అంతా ఖర్చు చేసి ప్రజలకు సౌకర్యాలు కలిగేటట్లు చేయాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

White paper లో జిల్లాబోర్డుల ఎలక్షనులకు ఎంతడబ్బు ఖర్చు అవుతుందో వివరాలిచ్చారు. మనకు అంతడబ్బు లేదు. ఎలక్షనులకు అంత ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టుకోవడం అనవసరం. Direct elections పెట్టుకోకుండా, Indirect elections ద్వారా అన్ని గ్రామపంచాయితీలనుండీ సభ్యులను తీసుకుంటే మంచిది. అప్పుడే జిల్లాబోర్డులు efficiency తో, effective గా function చేస్తాయని మనవి చేస్తున్నాను. అంతేకాని, District Boards ను రద్దు చేసే ఆలోచన చేయకూడదు పంచాయతీ కమిటీలకూ, జిల్లాబోర్డులకూ మధ్యన Block Conncils ఉంటాయి. Wilfare activities సంబంధించీ, administration లో ప్రజలకు training యిచ్చే విషయంలోనూ ఆ బ్లాక్ కౌన్సిల్స్‌కే సర్వాధికారులు యిస్తే ప్రయోజనం ఉండదు. కాబట్టి తొందరగా జిల్లాబోర్డులను revive చేసి ఎన్నికలు జరిపించాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ యం. కోటిరెడ్డి (మంగళగిరి) : అధ్యక్షా, మంత్రిగారు ప్రతిపాదించిన demand ను బలపరుస్తూ కొన్ని సూచనలు చేస్తున్నాను. ప్రస్తుతం ఉన్న జిల్లాబోర్డు రోడ్లన్నీ చాలా దుస్థితిలో ఉన్నాయి. కొత్త రోడ్లు వేసినా వాటిని మళ్ళీ మరమ్మతు చేయకపోవడంవలన గుంటలుపడి ఎందుకూ పనికిరాని స్థితిలోకి వచ్చాయి. జిల్లాబోర్డులు గ్రామస్థుల సహాయంతో కొన్ని రోడ్లను నిర్మిస్తున్నాయి, గ్రామస్తులనుండి సగం డబ్బు తీసుకొని మంగళగిరినుండి తుళ్ళూరు వరకూ ఒక రోడ్డు వేస్తున్నారు. ఆ పని కొంతవరకూ పూర్తి అయినది. మిగిలిన పని అట్లాగే నిలిచిపోయింది. రోడ్డుకు 4, 5 సంవత్సరాలనుంచీ మరమ్మతులు లేకపోవడంవల్ల అధ్వాన్నస్థితిలోకి అవి వచ్చినవి. ఆ పరియాలో పొగాకు ఎక్కువగా పండుతుంది. దానివలన ప్రభుత్వానికికూడా డబ్బు వస్తుంది. కాని ఆ రోడ్డుకు మరమ్మతు విషయంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవడంలేదు. అందువలన అక్కడి ప్రజలు బొగ్గు తోలుకోడానికీ, పొగాకును మార్కెటుకు తోలుకోడానికీ చాలా యిబ్బంది పడుతున్నారు. మా రోడ్డుగతి ఏమిటి అని ప్రజలు ప్రతి సంవత్సరమూ అడుగుతూ ఉంటారు. మేము జిల్లాబోర్డులకు వెళ్ళి P. A. లను ఎన్నిసారులు అడిగినా "డబ్బులేదు; మేము ఏమిచేయగలం; డబ్బు

కేటాయిస్తే గదా చేయించడానికి'' అంటూ ఉంటారు. మన ప్రభుత్వంవారు జిల్లాబోర్డుల రోడ్లకు కేటాయించిన మొత్తం చాలా స్వల్పమైనది. మంత్రులు ''మేము రైతు ప్రతినిధులము'' అని చెప్పుకుంటూ ఉంటారు. వారు రైతు ప్రతినిధులయినా, పల్లెటూళ్ళనుంచి యిక్కడకు వచ్చినవారైనా పల్లెటూళ్ళ అభివృద్ధి విషయంలో చాలా అశ్రద్ధ చూపుతున్నారని చెప్పడానికి నేను విచారిస్తున్నాను. వారు పట్టణాలలో నివసిస్తూ అచ్చటి కష్టసుఖాలే చూచుకుంటున్నారు. కేవలం అచ్చటి Roads, Drainage Sechemes, Water Supply Schemes — మొదలైనవి చూచుకోవడమే తప్ప వేలాదిగా ఉన్న పల్లెటూళ్ళ సంగతి పట్టించుకోవడం లేదు. పల్లెటూళ్ళ పరిస్థితి ఎట్లా ఉన్నది అని ప్రభుత్వం గాని, ప్రభుత్వ ఇంజనీరులుగాని పరిశీలించిన పాపాన పోవుటలేదు మంత్రులు అప్పుడప్పుడు పల్లెటూళ్ళకు వస్తూవుంటారు. అటువంటప్పుడు ప్రజలు సన్మాన పత్రంలో ఈ ఊరికి యీ రోడ్డు కావాలనీ, మా ఊరికి ఆ రోడ్డు కావాలని కోరుతూ ఉండడం ఒక ఆచారం అయిపోయినది. కాని పనులు ఏమీ నిర్వహించబడుటలేదు. ప్రభుత్వం బాధ్యత వహించుటలేదు.

జిల్లాబోర్డు ఆస్పత్రులలోగూడ మందులు ఉండవు. ప్రస్తుతం మంగళగిరి ఆస్పత్రిలో దాదాపు సంవత్సరమునకు 12 వేల రూపాయలను జీతాలక్రింద చెల్లిస్తున్నారు. కాని మందులకు నెలకు వందరూపాయలుమాత్రమే ఇస్తున్నారు. కనీసం జీతాలంత మొత్తమైనా మందులకు ఇవ్వకపోతే ఆ ఆస్పత్రి వుండీ ప్రయోజనంలేదు. అక్కడ సామాన్య మందులుకూడా ఉండవు. అలాంటి పరిస్థితులలో ఆస్పత్రిని నడపుటకంటే మూసివేస్తేనే బాగుంటుంది. సంవత్సరానికి జీతాలక్రింద ఇచ్చే 12 వేల రూపాయలు మిగులుతుంది. ప్రతి గ్రామంలోనూ రూరల్ ఆస్పత్రులు ఉన్నవి. వాటి పరిస్థితికూడా ఇలాగే ఉన్నది.

మేము ట్రంకురోడ్డుకు 3, 4 మైళ్ళ దూరంలో ఉన్నాము. మా ఊరి నుండి ప్రతిరోజు దాదాపు మూడు వందల కూరగాయల కావిళ్లు బెజవాడకు వస్తుంటాయి. రోడ్డుకు మూడు మైళ్ళ దూరం ఉన్నా దాదాపు 9 మైళ్ళు భుజాన కావిళ్ళు వేసుకొని పోవలసి ఉన్నది. రైతులు ఈ విధంగా చాలా ఇబ్బంది పడుతున్నారు. దీనినిగురించి చాలాసార్లు ప్రభుత్వమునకు మనవి చేసుకున్నాం. జిల్లాబోర్డు P. A. గారిని అడిగితే పాతరోడ్లు మరమ్మత్తుకే మా దగ్గర డబ్బులేదు, ఇక క్రొత్తరోడ్లను ఎలా వేయగలమని సమాధానం చెప్పుతున్నారు. మంగళగిరి బ్లాకు ఏర్పాటైనప్పుడు మంత్రిగారిని తీసుకు వెళ్లి రోడ్లకు, స్కూల్సుకు అన్నింటికి ప్రారంభోత్సవపు రాళ్ళు వేయించాము. వేసినరాళ్ళు వేసినట్లే ఉన్నవి. ఒక్క రోడ్డుకూడ పూర్తి కాలేదు. కారణం N. E. S Blocks లో చిన్న చిన్న రోడ్లు తప్ప, పెద్ద రోడ్లను వేయుటకు

డబ్బులేదు అంటారు. ఈ రోడ్డు ఎస్టిమేషన్ 30,40 వేల వరకు అయినది. ఇంతడబ్బు మా దగ్గర లేదన్నారు. 1937 లో గోపాలరెడ్డిగారు వచ్చినప్పుడు జిల్లాబోర్డువారు ఆ రోడ్డును బాగుచేయించారు. తరువాత 1,2 సార్లు కాస్త కంకర వేయించారేకాని మరమ్మత్తుచేసిన పాపాన పోలేదు. అది వరదప్రాంతం అయినందువల్ల రోడ్డు పూర్తిగా చెడిపోయి మనుష్యులు వెళ్ళుటకు కూడా అసాధ్యంగా ఉన్నది. బెజవాడ బ్యారేజి తయారైనా దగ్గరగాఉన్న గ్రామాలకు వసతి లేకుండా పోయింది. కాబట్టి శ్రద్ధతీసుకొని ఈ రోడ్డును వేయించాలని మంత్రిగారిని కోరుతున్నాను. ఇంజనీర్సు పూర్తిగా వారి దృష్టిని బస్తీలపైపే కేంద్రీకరించారు. బస్తీలకు నీటివనరులక్రింద, డ్రైనేజి స్కీముక్రింద దాదాపు 5 కోట్ల రూపాయలను కేటాయించారు. కాని ఈ పల్లెటూళ్ళ రోడ్లకు 20 లక్షల రూపాయలను మాత్రమే కేటాయించారు. దీనినిబట్టి పల్లెలను మంత్రులు ఎంత నిరాదరణగా చూస్తున్నారో తెలుస్తున్నది. నూటికి 85 మంది గ్రామాలలో ఉన్నారు. వారిలో ఎక్కువమంది రైతులు. వారిమీద పన్నులు వేయకపోతే మరెవ్వరిమీద వేయగలమని గోపాలరెడ్డిగారు పార్టీ మీటింగులో అన్నారు. అలా పన్నులువేయడానికి సిద్ధంగా ఉన్నారేగాని వారికి కావలసిన రోడ్డు సౌకర్యములు కలుగచేయటానికిమాత్రం సిద్ధంగాలేరు. మిగతా సౌకర్యములు ఎలాఉన్నా వారు పండించిన పంటను, గడ్డిని ఇంటికి తీసుకపోవుటకు దార్లైనాసరిగా లేకపోతే వారిదగ్గర పన్నులు ఏ విధంగా వసూలు చేయగలుగుతాం? ఇప్పుడు అనేకవిధాలైన పన్నులు వేస్తున్నారు. ఈ పన్నులు వసూలుచేసి అందరిని అభివృద్ధిలోకి తెస్తామని చెప్పుతూ ఏ సౌకర్యమూ కలుగజేయకపోయినచో ఆ పన్నులను వసూలుచేయుటే కష్టమౌతుంది వసూలుకు ఆ ఊళ్ళకు వెళ్ళుటకుగూడ ఎవ్వరికి ధైర్యముండదు. ఆ విషయాన్ని గ్రహించాలని మనవి చేస్తున్నాను. కాబట్టి ఇంజనీర్లు నెలకు కనీసం నాలుగు ఊళ్లయినా చూస్తూ ఉంటే ప్రజల అవసరములు వారిదృష్టికి రాగలవు. వారు బస్తీలలోనే ఉంటున్నారు. కాబట్టి బస్తీ ప్రజల కష్టసుఖాలు, అక్కడ ఉన్న రోడ్సు వారి కళ్ళకు కనబడుతున్నాయే తప్ప గ్రామాల రోడ్లు కనబడుట లేదు. కొన్ని గ్రామాలకు వెళ్ళుటకే దుస్తరంగా ఉన్నది. ఆ మాత్రంకూడా ఇంజనీర్లు గ్రహించకపోతే లాభం లేదు.

**श्री माधो राव (जुकल)** : आनबरेल हुकूमत मुक़ामी के मिनिस्टर साहब ने जो डिमैंड्स पेश फ़रमाए हैं, उसके मुताल्लेक़ मैं अपने खयालात जाहेर करूँगा। मिनिस्टर साहब की तक़रीर के बाद जब हम हुकूमत मुक़ामी के हालात के ताल्लुक़ से आंध्र और तेलङ्गाना का मुक़ाबला करते हैं, तो मुझे ज़मीन और आसमान का फ़र्क़ मालूम होता है। आंध्र में हुकूमत मुक़ामी के हालात तेलङ्गाना की हुकूमत मुक़ामी के हालात से कई गुना बेहतर हैं। यह आज से नहीं बहुत पहले से ही हैं। लेकिन इसकी

ख़ास वजूहात भी है। आंध्र में एक ज़माने से जमहूरी तर्ज़ की हुकूमत चल रही है। यहाँ पर देही मुक़ामात में पञ्चायतों को जो एख़तियारात दिये गये हैं, वह साम्राजियत के तहत जैसे चलने थे वैसे ही है। वहाँ की आमदनी, यहाँ की आमदनी। वहाँ के अख़राजात, यहाँ के अख़राजात, वहाँ की तामीरी तरक़्क़ी, यहाँ की तामीरी तरक़्क़ी में कई गुना फ़र्क़ है। मै मुकतसर में मिनिस्टर साहब हुकूमत मुक़ामी से अपील करता हूँ कि तेलङ्गाना के हुकूमत मुक़ामी के हालात को आंध्र के लेवल पर लाने के लिए कोशिश फ़रमाये। मुझे आशा है कि वह ज़रूर तेलङ्गाना की तरक़्क़ी फ़रमायेंगे।

इसके बाद मुझे कुछ ग्राम पञ्चयतों के मुताल्लेक़ अर्ज़ करना है। हमारे तेलङ्गाना में ग्राम पञ्चायतों की आमदनी बहुत ही कम है। कानून के लेहाज़ से उनको जो आमदनी मिलनी चाहिए और उनको जो ख़र्च करने का मौका दिया जाना चाहिए उसका मौका नहीं दिया जाता। कानून के तहत हमारी पञ्चायतों को लोकल फ़ण्ड का एक तेहाई हिस्सा मिलना चाहिए और रेवेनिव का १५ फ़ीसद मिलना चाहिए। लेकिन वह १५ फ़ीसद रेवेनिव पञ्चायतों के ख़र्च के लिए नहीं मिलता। जहाँ तक मेरा ख़याल है इसका निस्फ़ यानी साढ़े सात फ़ीसद बाज़ पञ्चायतों को दिया जाता है। और बाज़ पञ्चायतों को तो वह भी नहीं मिलता। इसलिए मैं मिनिस्टर साहब से अपील करता हूँ कि वह लोकल फण्ड की आमदनी जिस मौज़े से वह हासिल होती है, कामिल तौर पर वह उस मौज़े की पञ्चायत को दिलवायें। और रेवेनिव का कम से कम २५ फ़ीसद हिस्सा पञ्चायतों के अख़राजात के लिए दिलायें। इसके बाद हराज़ात-अबवाबी जैसे तमर हिन्दी, माही या आम वग़ैरा के हैं, इन हराजात अबवाबी की आमदनी बजाये रेवेनिव डिपार्टमेंट को देने के इसको पञ्चायतों के स्वाधीन किया जाये तो बहुत अच्छा है। इसके अलावा तेलङ्गाना पञ्चायतों की हालत इस वजह से भी ठीक नहीं है कि वहाँ की पञ्चायतों को फ़न्नी मशवरा जो दिया जाता है, वह बिल्कुल नाकाफ़ी है, बल्कि मै कहता हूँ कि उन्हें फ़न्नी मशवेरा मिला ही नहीं। इस लिए मेरी राय है कि हर तहसील में जहाँ पञ्चायतें हैं एक एक सूपरवाइज़र और उसका अमला इन पञ्चायतों को मशवेरा देने के लिए रखा जाय तो ठीक होगा। हमारे कई दोस्तों ने भी फ़रमाया कि पञ्चायत इंस्पेक्टर डिविज़न के लिए एक होता है। उसके तहत तीन तीन ताल्लुक़े होते हैं। इस लिए वह अपने काम को ठीक ढङ्ग से अंजाम नहीं दे सकता। इस लिए मेरी राय है कि हर ताल्लुक़े में पञ्चायत इंस्पेक्टर मुक़र्रर किया जाय ताकि वह पञ्चायतों का दौरा कर के उनके अरकान को मशवेरा दे सके कि कारोबार किस तरह से चलाया जाय और अपने मालूमात से उनको फ़ायदा पहुँचायें।

इसके बाद पञ्चायतों के ताल्लुक़ से मैं यह चीज़ भी वाज़ेह कर देना चाहता हूँ कि पञ्चायतों में एक कारोबारी मुक़र्रर होता है, जिसकी तनख़्वा १५ रुपये होती है। मैं समझता हूँकि यह बिल्कुल नाकाफ़ी है। इस लिए जहाँ बड़ी पञ्चायतें हैं वहाँ कारोबारी की माहवार याफ़्त ५० रुपये और छोटी पञ्चायतों के कारोबारी की याफ़्त ३० रुपये इस तरह से गोया कारोबारी की याफ़्त ३० और ५० रुपये के दरमियान होनी चाहिए, ताकि वह अपना पूरा वक़्त दे सके और ज़िम्मेदारी से कारोबार अनजाम दे सके।

इस के बाद हमारे ताल्लुके बोधन की म्युनिस्पालटी के मुताल्लेक अर्ज करूंगा। वहाँ १४५०० रूपये बग़रज़े खरीद इंजन और पंप्स एकजिक्युटिव इंजीनियर वाटर वर्क्स को दिये गये हैं। वह सिर्फ इञ्जन्स लाकर डाल दिये है। अभी पंप्स नहीं आये है। इस तरह पूरा काम रुक गया है। मै मिनिस्टर साहब से कहूँगा कि वह इञ्जन्स और पंप्स दोनों की फ़राहमी का इन्तेजाम करके पानी की सप्लाई का इन्तेजाम करें।

इस के बाद मै एक और चीज़ वाजेह करदेना मुनासिब समझता हूँ। हमारे आनरेबल मिनिस्टर साहब हुकूमते मुकामी ने हमारे जिले का दौरा आंध्र प्रदेश के क़ियाम के बाद से आज तक नही फरमाया है मै उन से ख़ाहिश करता हूँ कि वह हमारे जिले का दौरा फरमाकर वहाँ की रिआया की फलाह बहबूद की जरूरियात से वाकिफ होकर उनको पूरा करने की तरफ ध्यान दें। मैं अैसी आशा करते हुए अपनी तकरीर खतम करता हूँ।

*శ్రీ చంద్రా ఓబులరెడ్డి : అధ్యక్షా! లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ మంత్రిగారు ఈ డిమాండును ప్రతిపాదించటం సంతోషకరమే. మనది ప్రజాస్వామ్య సూత్రాలను అనుసరించి పరిపాలించే ప్రభుత్వము. అయితే డిస్ట్రిక్టుబోర్డు ఎన్నికలను రద్దు చేయటం, పంచాయితీ ఎన్నికలు బహిరంగ పద్ధతిని జరిపించడం అనేవాని వల్ల ప్రజాస్వామ్య సూత్రాలను ఉల్లంఘించటము అవుతున్నట్లు మనకు కనిపిస్తున్నది, ప్రభుత్వ విధానములో పక్షపాతమునకు తావులేదని. ప్రతి పని నిష్పక్షపాతముగా జరుగుతుందని మంత్రిగారు చెప్పినందుకు వారిని అభినందిస్తున్నాను. ప్రభుత్వ శాఖల గురించి, వాటిలో జరుగుతున్న అన్యాయాల గురించి అనేక మంది మిత్రులు చెప్పారు. ప్రభుత్వ సభ్యులు కూడా విమర్శించారు. ఈ స్థానిక స్వపరిపాలన శాఖ వాటికి అతీతంగా లేదని నేను మనవి చేస్తున్నాను. నా నియోజకవర్గములోని నా అనుభవాన్ని మంత్రిగారిదృష్టికి తీసుకురాదలచుకొన్నాను. నా నియోజకవర్గములో పొత్తూరు మునిసిపాలిటీ వుంది. అచ్చట స్థానిక స్వపరిపాలన అనేది లేదు. చైర్మన్, కమీషనర్ గారి స్వంత పరిపాలన జరుగుతున్నది. ఆ సంగతి మంత్రిగారికి తెలిసినా వారు బైటపెట్టటానికి వీలు లేకపోవటంవల్ల వూరుకొంటున్నారేమో! ఈ మధ్య జరిగిన ఉపఎన్నికల తరువాత చైర్మన్‌గారిఅండదండలలో కమిషనర్ ప్రజలపై దండయాత్ర ప్రారంభించాడు. కమిషనర్‌గారి గత చరిత్ర గురించి అతని రికార్డు పైఆఫీసర్లకు పంపించటం జరిగినా ఇంతవరకు అతనిపై ఎటువంటి చర్య తీసుకోలేదు. గుంతకల్లులోను, తాడిపర్తిలోను కమిషనరుగా ఆయన పనిచేసినపుడు కరప్ట్‌మాన్ అని అతనిపై రిపోర్టులు వున్నాయని అతనిపైఆఫీసర్లు మాతో చెప్పారు. అతనిపై ఎటువంటి చర్య తీసికోకపోవటంలోగల తమ బాధను, నిస్సహాయితను వారు వెల్లడించారు. అంత అవినీతిగా వున్నవానిని శిక్షించటంలేదంటే అది ప్రజాస్వామ్యమునకే దెబ్బ అని, అందుకు అతనిపై వెంటనే చర్య తీసుకోవాలని

మంత్రిగారిని కోరుతున్నాను. అన్ని విషయాలు విచారణ సందర్భంలో నేను ఋజువు చేయగలనని మంత్రిగారికి మీ ద్వారా తెల్పుతున్నాను.

మిస్టర్ స్పీకర్: మీరు ఒక అర్జీవ్రాసి మంత్రిగారికి ఇస్తే వారు విచారిస్తారు.

శ్రీ చంద్రా ఓబులరెడ్డి: 21-7-57 న ఒక మెమోరాండమును I L B గారికి మంత్రిగారికి ఇచ్చాము. అక్కడ వారి చర్యలు విపరీతంగా ఉన్నవి. ఎన్‌క్రోచ్‌మెంటు అనేపేరుతో చైర్‌మెన్‌కు వ్యతిరేకుల ఇండ్లను పడగొట్టించారు. డిమాలిషన్ నోటీసులు జారీచేయకుండానే అలా చేశారు. దానివల్ల వారు కొంతడబ్బును సంపాదించడం జరిగిందనే పుకారుకూడావుంది. ఆ విషయాన్ని మంత్రిగారి దృష్టికి తీసుకువస్తే వారు Joint Director of Town Planning కు పంపారు. వారు తమ రిపోర్టులో "ఆయనకు రాజకీయాలతో ప్రమేయం వున్నట్లు" తేల్చారు. దానిపై ఏమీచర్య తీసుకున్నారో మాకు తెలియదు. ఉద్యోగస్థులకు రాజకీయ ప్రమేయాలతో సంబంధంవుంటే అది అరాజకానికి దారితీస్తుందని ఒకసారి బ్రహ్మానందరెడ్డిగారు చెప్పినట్లు నాకు జ్ఞాపకం వుంది. 40 వేల జనాభా 5 లక్షల ఆదాయంగల పొద్దుటూరు గ్రామములో ఆ డబ్బును ప్రజలకొరకు వినియోగించటంలేదు. ఆ ప్రశ్నను మేము ఇక్కడ అడిగితే "అది స్థానిక సమస్య. ఓబులరెడ్డిగారే స్వయంగా సంప్రదించకూడదా" అని మంత్రిగారు చెప్పినట్లు నాకు గుర్తు. కాని మేము అక్కడికివెళ్ళటానికే ఇబ్బందిగా ఉంటున్నది. ప్రజాస్వామ్య విరుద్ధమైన వాతావరణము అక్కడవుంది.

కందిపప్పులో కొల్దాఅనే పదార్థము కలపటంవల్ల అది poisonous అయిందని అది పంజాబునుండి వచ్చిందని అది ప్రమాదమని గుర్తించి health point of view లో దానిని సీల్ వేయాలని కమిషనర్ ఉత్తర్వు జారీచేశారు. అది కోర్టుకువెడితే ప్రజలపైపే న్యాయంకలిగింది. మరల చింతపండులో విషం కలిపారని ఆచైర్‌మన్‌కు వ్యతిరేకులైన వర్తకులపై దాడిచేసి డబ్బు సంపాదించాలని ప్రయత్నించారు. ఆ విషయమును కరపత్రములద్వారా తంతుల ద్వారా మంత్రిగారికి తెలుపటం జరిగింది. దానికి ఎవరు బాధ్యులో నేను వ్యక్తులతోసహా చెప్పగలను కాని మీరు ఆవిధంగా మాట్లాడటం మంచిదికాదని శలవిచ్చారు కనుక కొన్ని points ను మాత్రమే చెప్పదలచాను. ఎవరైనా మంత్రులు ఆహ్వానించినపుడు చైర్‌మన్, వారి తరపువారు వీరికి విందులు యివ్వడం జరుగుతోంది. దీనివల్ల తమ కష్టాలను చెప్పుకొన్నా ప్రయోజనం ఉండదేమోననే నిరుత్సాహం ప్రజలలో ఉంది. అందుచేతనే వారి ఉపన్యాసాలకు ప్రజలు హాజరు కావటంలేదు. మంత్రిని అగౌరవించటానికి వారిని అమర్యాదపాలు చేయటానికి ప్రజలు మానివేయటం లేదు. స్వలాభాలకొరకు

స్థానిక రాజకీయాలలో జోక్యం ఉన్న వ్యక్తులు అక్కడ ఉండటంవల్లనే, ఆ సభలను ఏర్పాటు చేయటంవల్లనే ప్రజలు హాజరుకావటంలేదు. హోమ్ మినిస్టర్ గారు వచ్చినపుడు ప్రజలెవరూ రాలేదు. కనుక యీ పాలసీని మార్పించి స్థానిక పరిపాలనలో రాజకీయ ప్రమేయములను, ముఠాలను అరికట్టాలని మీ ద్వారా మంత్రిగారికి మనవి చేస్తున్నాను.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : అధ్యక్షా, ఆంధ్ర ప్రాంతంలో జిల్లా బోర్డులు ఉన్నప్పటికిని ప్రస్తుత పరిస్థితులలో అంత ఉపయోగకరంగా లేవు. కాబట్టి వాటిని రద్దుచేసి, వాటి స్థానంలో వేరే సంస్థలను ఏర్పాటు చేయాలన్న ప్రభుత్వ సూచనను, నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. జిల్లాబోర్డులకు ముందు ఉన్నటువంటి, ఇప్పుడు ఉన్నటువంటి పనులలో చాలా వ్యత్యాసము ఉన్నది. వీటివల్ల యేమాత్రం ఉపయోగం లేకపోవడమే కాకుండా, ప్రజలనుండి వసూలుచేసే సెస్సు డబ్బులో చాలా భాగం హెడ్డుక్వార్టర్సులోను పట్టణ ప్రాంతాలలోనే ఖర్చుపెట్టడం జరుగుతున్నది. గ్రామాదులలో ఖర్చుపెట్టడం చాలా తగ్గిపోతున్నది. ఇటువంటి సందర్భంలో ఈ జిల్లాబోర్డులను మానిపించి గ్రామాదులలో ఈ డబ్బు సక్రమంగా ఖర్చు అయ్యేట్లు చూడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. జిల్లాబోర్డుల స్వాధీనంలో ఉన్న పెద్దపెద్ద రోడ్లు అన్నిటిని ప్రభుత్వం ఇదివరలో స్వాధీనపరచుకొన్నది. కొన్ని చిన్నచిన్న రోడ్లుమాత్రమే ప్రస్తుతం జిల్లాబోర్డుల చేతులలో ఉన్నాయి. పోతే జిల్లాబోర్డుల చేతులలో ఎలిమెంటరీస్కూల్సు, కొన్ని సెకండరీ స్కూల్సుతప్ప, యితరసంస్థలేవీలేవు. ఈరోడ్లు అన్నీ ఏపరిస్థితులలో ఉన్నాయో గత అయిదారు సంవత్సరాలుగా అందరికి తెలిసినవిషయమే! కరువుకాటకాల సమయంలో వేసినరోడ్లు ప్రస్తుతం చాలా అధ్వాన్న పరిస్థితిలో ఉన్నవన్న సంగతికూడ అందరికి తెలిసినవిషయమే! వీటినిగూర్చి ప్రతిసంవత్సరం, బడ్జెటు సమావేశంలోనూ, యింకా యితర సందర్భాలలోను మేమందరం ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొని వస్తున్నాం. ఆవిషయం ప్రభుత్వానికి తెలుసు. అసలు జిల్లాబోర్డులు చేయవలసిన ముఖ్యమైన పని, communications కు చక్కటిరోడ్లు ఏర్పాటుచేయడం. ప్రధానమైన పట్టణాలను కలిపే ముఖ్యరోడ్లేకాకుండా, పల్లెలకు, గ్రామాలకు పోయే రోడ్లనుకూడ మంచిస్థితిలో ఉంచడం బోర్డులకర్తవ్యం. కాని ఈరోడ్లన్నీ యీనాడు చాలా దుస్థితిలో ఉండడం, శోచనీయమైనవిషయం. దీనికి కారణం ఈజిల్లాబోర్డులు చాల లోటుబడ్జెట్టులతో ఉండడం అయిఉండవచ్చు. ప్రస్తుతం నేను మంత్రిగారిని అడిగేది యేమనంటే జిల్లాబోర్డులు ఇప్పుడు యేరీతిలో ఉన్నవి? వచ్చేసంవత్సరం అయినా జిల్లాబోర్డులయొక్క ఆదాయాన్ని గ్రామసీమలకు వినియోగిస్తుందా? లేక ఇదివరకు ఉన్న అప్పులక్రిందకు జమకట్టడం జరుగుతుందా? ఈవిషయాలగురించి వివరంగాచెప్పమని మంత్రిగార్ని కోరు

తున్నాను. వచ్చేసంవత్సరానికి అయినా ఈరోడ్లు సరిగా బాగుచేయించక పోయినట్లయితే చాలాదుస్థితి ఏర్పడుతుందని ప్రభుత్వం దృష్టికి తీసుకొనివస్తున్నాను. కరువుకాటకాల సమయంలో కొన్నిచోట్ల చాల పెద్దరోడ్లు వేశారు. ఒక్కొక్కరోడ్డు 20 మైళ్ళు, 10 మైళ్ళు, 17 మైళ్ళు ఉన్నాయి. ఇటువంటి రోడ్లు మా జిల్లాలోకూడ వేశారు. ఈరోడ్లు అన్నీ పాడైపోయినాయి. అసలు యివి లేకుంటేనే బాగుంటుంది అనే పరిస్థితిలో ఉన్నది. వర్షాకాలంలో ఈరోడ్ల మీద మనుష్యులుగాని, బండ్లుగాని పోవుటకు వీలులేకుండా చాలా దుర్గమమైన పరిస్థితులు ఉంటున్నాయి కాబట్టి ఈరోడ్లు అన్నింటిని త్వరగా చక్కబరచడానికి పూనుకోకపోయినట్లయితే, ఆరోడ్లమీద ఇదివరకు పెట్టిన డబ్బు వృధా అయి పోవడమే కాకుండా ప్రజల అనుకూల్యాన్ని సంపాదించడానికి బదులు, వ్యతిరేకతను చూరగొనవలసివస్తుందని ప్రభుత్వంవారు గమనించాలి.

జిల్లా బోర్డులకు బదులు యే సంస్థలను యేర్పాటు చేయబోతున్నారు? వాని స్వరూపం ఎట్లా ఉంటుంది? అనే విషయాలు మునుముందు రాబోయే బిల్లులో ఉంటుంది. కాని యేసంస్థను ఏర్పాటుచేసినాకూడ, దానికి వచ్చే సెస్సు ధనంగాని, లేక యింకేవిధమైన ధనముగాని, నేరుగా గ్రామాలకు తీసుకొనిపోయి, అక్కడ సక్రమంగా ఖర్చు అయ్యేటట్లు చూడాలని నా సూచన. పంచాయితీలను విరివిగా ఏర్పాటుచేసి ఆ ధనమును పంచాయతీలకు యిచ్చినట్లయితే, గ్రామాదులలో ఏమిచెయ్యాలో వారు చూచుకొంటారు. గ్రామాలలో చిన్నచిన్న రోడ్లు మొదలైనవి వారు చూచుకొంటారు. పెద్దరోడ్లు ప్రభుత్వం చూచుకోవచ్చు. ఈ పంచాయితీలను ఏర్పాటు చేయడంలో చాలా అజాగ్రత్త, ఆలశ్యం జరుగుతోంది. మొత్తం ప్రదేశం అంతటిలోనూ ఈ పంచాయితీలను ఏర్పాటు చేసినట్లయితే, గ్రామాలు యెక్కువగా వృద్ధికావడానికి అవకాశం ఉంటుందని, ఈ విషయంలో ప్రత్యేకశ్రద్ధ వహించవలసినదని మనవి చేస్తున్నాను. రాబోయే సంవత్సరానికి హాస్పటల్సుకుగాని, వైద్య సౌకర్యాలకుగాని, సెకండరీ స్కూళ్ళకుగాని తగినంత మొత్తమును కేటాయించ లేదని తోస్తున్నది. దీనికి కావలసిన డబ్బును ప్రభుత్వంవాదు యేవిధముగానైన సేకరించి ప్రతి గ్రామానికి ఒక స్కూలు ఉండేటట్లు చూడవలసి ఉన్నది. లేకపోతే కొన్ని గ్రామాలను ఒక గ్రూపుగాచేసి, ఆ గ్రూపుకు ఒక స్కూలు అయినా యేర్పాటు చేయవలసిన బాధ్యత ఉన్నది. జిల్లాబోర్డుల పరిపాలన యీవిధముగా మారినట్లయితే దేశం సక్రమంగా పరిపాలింపబడి, ప్రజలకు, పరిపాలనతో తాముకూడ భాగస్తులము అనే అభిప్రాయము కలిగేటట్లు చేయవలసిన అవసరం ప్రభుత్వం వారిపై యున్నదని మనవిచేస్తు యింతటితో ముగిస్తున్నాను.

శ్రీ టి. హయగ్రీవాచారి (ధమ్మసాగర్) : అధ్యక్షా! ఈ పంచాయితీ కమిటీలు, మ్యునిసిపల్ కమిటీలు ఇవి అన్నీ ఆంధ్రప్రాంతంలో చాలాకాలం నుంచి నడుపబడుతున్నాయి. ఇక్కడమాత్రం 6, 7 సంవత్సరాలనుంచి ఎలక్టెడ్ కమిటీలు పనిచేస్తున్నాయి. అందులో అనేక లోపాలు ఉండడంవల్ల సరియైన స్థాయికి రాకపోవడం సహజమే! గ్రామాలలో చదువుకొన్నవారి సంఖ్య చాలా తక్కువగా ఉండడం, ఆర్థికపరిస్థితికూడ అంతగానె ఉండుటచేత సరియైన శిక్షణ అనుభవం లేకపోవుటచేత పంచాయితీ కమిటీలు బాగా పని చేయలేకపోతున్నాయి. మెహతాగారి రిపోర్టుప్రకారం వెంటనే పంచాయితీల పునాదులు గట్టిపడేటట్లు చేయాలి. అనుభవం గలిగిన పంచాయితీ ఇన్‌స్పెక్టర్లను తాలూకాకు ఒక్కొక్కరి చొప్పున నియమించి పంచాయితీలకు చక్కటి శిక్షణ యిచ్చుట అవసరం. ఎప్పటికప్పుడు ఇన్‌స్పెక్షన్ జరిపించుట చాలా అవసరం. కొన్ని పంచాయితీ కమిటీలు డబ్బు దుర్వినియోగం చేసినట్లు రిపోర్టులు వచ్చినప్పటికికూడ, వారిపై చర్య తీసుకోకపోవుటవల్ల, మిగతా పంచాయితీలుకూడ ఆ విధంగానే చేయుటకు ప్రోత్సాహం యిస్తున్నట్లు అవుతోంది. పంచాయితీలకు, కొన్ని బాధ్యతలు అప్పజెప్పి, గ్రామాభివృద్ధికి తోడ్పడవలెనని కోరినప్పుడు, వారు యేమైనా ప్రజాధనమును దుర్వినియోగం పరచినట్లయితే ప్రభుత్వం తప్పకుండా తగినచర్య తీసుకోవాలి.

పంచాయితీలకు రెవిన్యూలో 50% ఇవ్వాలనే ఆలోచన ఉన్నది. అది ఎప్పటికి అమలులో వస్తుందో తెలియదు. ఇదివరకు తెలంగాణాలో 15% రెవిన్యూ ఇవ్వాలని ఉన్నది. ఈ పంచాయితీలయొక్క ఆర్థికపరిస్థితి చాలా హీనంగా ఉన్నది. మొదట ఆ 15% యిచ్చినట్లయితే, తరువాత మెహతా కమిటీ సూచనను అమలుపరచడానికి ప్రయత్నించవచ్చు. ఈ 15% వెంటనే యివ్వడానికి పూనుకొంటె వాటి ఆర్థికస్థితి బాగుపడుతుంది.

ముందు ముందు మనం ప్రతి గ్రామంలోను పంచాయతీ కమిటీలను ఏర్పాటుచేయాలని చాలాకాలంనుంచి చెబుతున్నాము. ఏమి చెప్పినప్పటికినీ పంచాయితీ కమిటీల ఆర్థికపరిస్థితి బాగుచేయడానికి మనం మార్గాలు వెతకాలి. ప్రభుత్వ ఖజానానుంచి కొంత grants ఇవ్వడమో, లేక గ్రామంలోని ప్రజలకు ఎక్కువ బాధలేకుండా ఉండే tax వసూలుచేయడమో, ఏదో ఒకటి చేసి వాటి ఆర్థికపరిస్థితి బాగుచేయాలి. గ్రామ పంచాయితీలవద్ద కొద్దిపాటి డబ్బు ఉంటుంది. వారేదైనా పనిచేయాలంటే వారికి technical help దొరకదు. District Boards లో ఒక Engineer తాలూకాకు ఒక Sub-overseer ఉంటారు. Town Committees కు కూడా Local Development Works చేసు కోవడం కష్టంగా ఉంటుంది. అటువంటి కష్టమే పంచాయితీ కమిటీలలో ఏ

3-5 వేల రూపాయల మొత్తాన్ని schools కు, రోడ్లు వగైరాలకు ఖర్చు చేయాలంటే వాటికి technical help దొరకదు. డోర్నకల్‌లో ఒక cement road ను వేయాలని ప్రయత్నం చేస్తే, ఇప్పటికికూడా వారికి sanction దొరికిందో లేదో. 30-40 పంచాయితీలకు ఒక sub-overseer ఉంటారు. కాబట్టి ఏవైనా estimates వేయాలంటే ఆలస్యం అవుతూ ఉంటుంది. ఈ estimates తొందరగా తయారుచేసేటట్లుగాను, వాటికి కావలసిన డబ్బు వగైరా త్వరలో ఇచ్చే ఏర్పాటుచేయమని కోరుతున్నాను. పంచాయతీ కమిటీలకు technical help లభించేటట్లు చేయమనికూడా కోరుతున్నాను.

తెలంగాణాలోని పంచాయితీ వ్యవస్థ లోటుగా ఉంది. ఆంధ్రలో 1,2 లక్షల రూపాయలు ఆదాయంగలవాటినికూడా పంచాయితీ కమిటీలుగా గుర్తిస్తున్నారు. తెలంగాణాలో 15 వేల జనాభా గలవాటినికూడా Town Committees గా గుర్తిస్తున్నారు. వీటిలో కొన్నింటికి ఆదాయం సరిగాఉంది; కొన్నింటికి సరిగాలేదు. ఈ Town Committees సక్రమంగా పనిచేయడానికి "శానిటరి ఇన్‌స్పెక్టర్ గ్రేడు"తో ఒక Executive Officer ను నియమిస్తున్నారు. ఇంకా చాలా చోట్ల వీరిని వేయవలసి ఉంది. వీటికి ఆదాయం సరిగా ఉందా? లేదా? Dominion cadre fund 12½% సరిగా వస్తోందా? లేదా? ఈ 12½% తో Inspector జీతం పోను ప్రభుత్వానికి ఏమైనా మిగులుతుందా? అని ఆలోచించకుండా ఈ Executive Officers ను అన్నిచోట్ల వేసి, వాటి ఆదాయం అభివృద్ధిగావడానికి ఆ సొమ్ము దుర్వినియోగం కాకుండా ఉండేటట్లు మంత్రి గారు చర్యలు తీసుకోవలసిందని కోరుతున్నాను. ఈ fund ను గురించి చాలా కాలంగా తర్జనభర్జనలు జరుగుతున్నాయి. 12½% contribution ను తగ్గించాలనే ఆలోచన ఉంది. దీని విషయమై చాలామంది సభ్యులు మాట్లాడి ఉంటారు. ఈ విషయాన్నికూడా మంత్రిగారు ఆలోచిస్తారని తలుస్తున్నాను.

తెలంగాణాలోని పెద్దపెద్ద పట్టణాలలోను, towns లోను నీటివసతి సరిగాలేదు. ఈ నీటికొరత తీర్చడానికి కొన్ని District Head-quarters లోను, మరికొన్ని చోట్ల క్రొత్త schemes ప్రారంభించారు. అవి అన్నీకూడా incomplete గానే ఉన్నాయి. కొన్నిచోట్ల డబ్బులేదని, మరికొన్ని చోట్ల pumping sets రాలేదని, pipe దొరకలేదని చెబుతున్నారు. కొన్ని city Municipalities లో Schemes sanction అయి, డబ్బు ఉండికూడా పని జరగడం లేదు. Water Works Executive Engineer గారి క్రింద కంట్రాక్టర్లు పనిచేయడానికి సిద్ధపడటం లేదు. నేను వారిపై allegations పెట్టడం లేదు. ఈ విషయాన్ని మంత్రిగారి దృష్టికి తీసుకొనిరావలసిన అవసరం ఉంది. నా అనుభవం ఒకటి చెబుతాను. వరంగల్ జిల్లాలో ఖాజీపేటకు రు 1,20,000 లు

sanction అయి 8 సంవత్సరాలైనా పని ఇంతవరకు జరగలేదు. నేను స్వయంగా అనేకమంది contractors తో మాట్లాడినాను. వారు చెప్పినది ఏమనగా—"అయ్యా, మేము ఆ Department లో పనిచేస్తే మాకు సౌకర్యాలు treatment సరిగా ఉండవు. మా Bills సరిగా రావు. అందువల్ల ఆ Department Heads లో మార్పురావాలి" అని. కాబట్టి ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధతీసుకొని ఆ Department Heads లో మార్పు తీసుకొనిరానంతకాలం, sanction అయిన schemes సరిగా అమలుకావని మనవిచేస్తున్నాను.

*శ్రీ ఎ. ఎరుకునాయుడు (సాలూరు-జనరల్) : అధ్యక్షా ! ఈ సంవత్సరం ప్రత్యేకంగా స్థానిక స్వపరిపాలనాశాఖ demand ను చూసి సంతోషించవలసి ఉన్నప్పటికీ details చూసిన స్థానిక సంస్థలకు ఆర్థికసహాయం కాని, వాటి ఆర్థిక పరిస్థితులను చక్కపరచడానికి తగిన సూచనలేవీ లేనందువల్ల విచారించవలసి ఉంది. ముఖ్యంగా బల్వంతరాయి మెహతా కమిటీ సూచనల ప్రకారం, పంచవర్ష ప్రణాళిక జయప్రదం కావడానికి ప్రతి గ్రామంలోను పంచాయితీ కమిటీలను తొందరగా ఏర్పాటు చేస్తున్నారే కాని, వాటి ఆర్థిక పరిస్థితి ఎల్లా ఉంది ? దానిని ఏవిధంగా బాగుచేయాలని ఆలోచించడం లేదు. పూర్వం ఆంధ్ర ప్రభుత్వం 1950 సం. రంలో చేసిన చట్టం ప్రకారం land revenue లో కొంత భాగమైనా పంచాయితీలకు ఇస్తే బాగుంటుందికదా ? 1956 సం.రంలో ఆ provision కూడా తీసివేశారు. పంచాయితీల ఆర్థిక పరిస్థితులను బాగుచేయ డానికి ఆలోచించకుండా తొందరగా వాటి సంఖ్యను పెంచి ప్రయోజన మేమిటి ? ఇప్పటికి 9 వేల పంచాయితీలను ఏర్పరచారు. వీటిని ప్రజలకు సౌకర్యాలు కలిగించడానికి కాక, కేవలం కాగితాలపై లెక్కలు చూపించ డానికి ఏర్పాటు చేస్తున్నట్లు కనిపిస్తోంది. బల్వంతరాయి మెహతా కమిటీ సూచనల ప్రకారం land revenue లో నూటికి 50 వంతులు కాకపోయినా, నూటికి 25 వంతులు అయినా ఇస్తే ఈ పంచాయితీలు సక్రమంగా నిర్వహించ బడతాయని అశిస్తున్నాను.

జిల్లాబోర్డుల పరిస్థితిని గురించి White Paper లో They have outlived the purpose అని ఉంది. పంచాయితీలు కనీసం పూర్తిగా ఏర్పడే వరకైనా, ఇప్పటి జిల్లాబోర్డులు నిర్వహిస్తున్న రోడ్లన్నింటినీ ప్రభుత్వం త్వరగా స్వాధీనం చేసుకుంటేకాని అవి బాగుపడవు. అదేవిధంగా Taluka Head Quarters లోని Hospitals ను ప్రభుత్వం త్వరలో తీసుకొని ప్రజలకు సౌకర్యం కలిగించమని మనవి చేస్తున్నాను.

మునిసిపాలిటీలకు ప్రభుత్వ సహాయం లేకుండా అవి ఎట్లా నిర్వహించ బడగలవో నాకు అర్థంకావడంలేదు. గత 2,3 సంవత్సరాల నుంచి చూసి

నట్లయితే మునిసిపాలిటీల ఆదాయం క్రమంగా తగ్గిపోతోంది. Toll gates కు compensation తీసివేశారు, entertainment taxe లో భాగం తగ్గించారు, కొన్ని భవనాలపై సర్ చార్జీని మునిసిపాలిటీలే కాకుండా ప్రభుత్వమే వేయ డానికి Bill ను తీసుకువచ్చారు. ఈవిధంగా వాటి ఆదాయం తగ్గిపోతోంది. పంచాయతీలకు, మునిసిపాలిటీలకు కొన్ని నిత్యభాధ్యతలున్నాయి. ప్రజల సౌకర్యాలకు, lighting, medical, education పరిస్థితులను బాగుచేయడానికి ప్రభుత్వం ఇదివరలో grants ఇచ్చేది. ఆ grants ను కూడా గత సంవత్సరం, తీసివేశారు. ఇప్పుడు మంత్రిగారు 1958-59 లో కాని 1960 లో కాని toll gates నిమిత్తం compensation ఇస్తామని చెబుతున్నారు. అప్పటివరకు వాటిని ఏవిధంగా నిర్వహించాలో మంత్రిగారే శెలవిస్తే బాగుంటుంది.

Municipality ల సిబ్బందికి D. A. increase చేయడానికి కేంద్ర ప్రభుత్వం తనవంతు grant గా ఇవ్వటానికి అంగీకరించి ఒక సంవత్సరం అయింది. ఇంతవరకు రాష్ట్ర ప్రభుత్వం తనవంతు భాగాన్ని భర్తీ చేయడానికి ఎట్టి చర్య తీసుకోలేదు దానికి orders పంపలేదు. మునిసిపాలిటీలు ఇప్పటివరకు తమ సిబ్బందికి జీతాలు ( D. A. etc. ) ఇస్తున్నందువల్ల ఇక రెండు నెలలకైనా జీతాలు ఇచ్చేస్థితిలో లేవు. కాబట్టి ప్రభుత్వం తాను ఏటా ఇచ్చే grants ను ఈ మార్చి నెలాఖరుకైనా పంపే ఏర్పాటు మంత్రిగారు చేయవలసిందిగా కోరుతున్నాను.

జిల్లాబోర్డులు నిర్వహించే రోడ్లకు ప్రభుత్వం grants ఇస్తుంది. ఉదాహరణకు సాలూరు తాలూకాలో ముఖ్యంగా agency కి పోయే "బండిగామరోడ్డు" విషయం చెబుతాను. గత పది సంవత్సరాలనుంచి ఈ రోడ్డుకు estimates తయారు కావడం ప్రభుత్వం అంతో, ఇంతో grants మార్చినెలలో ఇచ్చి ఈ 40 వేల రూపాయలు మార్చి నెలాఖరుకు ఖర్చుపెట్టమనడం జరుగుతోంది. అంత డబ్బును అంత స్వల్పవ్యవధిలో ఎట్లా ఖర్చుపెట్టడం ? ఆ డబ్బును ఖర్చుపెట్ట డానికి వీలులేక ఈ 10 సంవత్సరాలనుంచి ఆ రోడ్డుపనే జరుగలేదు. ఈరకంగా ఆలస్యం చేయడంవల్ల స్థానిక పరిపాలన బాగా దెబ్బతింటోందని మనవిచేస్తున్నాను.

ఆరోగ్యం విషయంలో rural water supply schemes కు పూర్వము 50% అప్పుగాను, 50% గ్రాంట్సుగాను ఇచ్చేవారు. కానీ ప్రభుత్వంవద్ద డబ్బులేదని చెబుతూ ఈ రోజున వాటిని self financing schemes గా convert చేశారు, రాబోయే సంవత్సరం ఒక కోటి రూపాయలవరకు loans ఇచ్చి చాలా schemes అమలుచేయడానికి సిద్ధంగా ఉన్నట్లు చెప్పినందుకు చాలా సంతోషంగా ఉంది. Schemes ను sanction చేసిన తరువాత వాటిని వెంటనే అమలు జరప

డానికి చర్యలు తీసుకొన్నప్పుడే, వాటివల్ల ప్రజలకు సౌకర్యాలు కలుగుతాయి. కాబట్టి ఆవిధంగా చేయమని కోరుతున్నాను.

శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం - జనరల్) : అధ్యక్షా, ఈ demand మీద చెన్నారెడ్డిగారు, ఎక్ బోటేగారు, తదితర శాసనసభ్యులు మాట్లాడుతూ ఈ పంచాయతీబోర్డుల లావాదేవీలలో ప్రభుత్వము అక్రమంగా అనేక విషయాలలో interfere అవుతున్నదని ఎన్నో విషయాలను సూచిస్తూ, ఆరోపించారు. దానికి మంత్రిగారు సమాధానమిస్తూ, అటువంటి policy ప్రభుత్వానికి ఎంతమాత్రము లేదని వక్కాణించారు. ఏదైన ఒక Non-official Committee ని వేస్తే, ఎక్కడెక్కడ ఇదివరకు ప్రభుత్వం అక్రమంగా interfere అయిందో, ప్రస్తుతము ఇంకెక్కడెక్కడ జోక్యం కల్గించుకుంటున్నారో వారి ముందు ఋజువు పరచడానికి మేమందరమూ సిద్ధంగా ఉన్నాము. ఇప్పుడు ఎక్కువ సమయములేదు కాబట్టి క్లుప్తంగా రెండు మూడు విషయాలు చెప్పడానికి పూనుకుంటున్నాను.

ఇటీవలనే మాజిల్లాలో ఒక పెళ్ళిజరిగితే, దానికి ఆరుగురు మంత్రులు రావడం తటస్థించింది. వచ్చి, రెండు వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని అంతకుముందు అక్కడ ఉన్నటువంటి ఒక order కు భిన్నంగా మరొక order ఇవ్వడం జరిగింది. 1958 ఫిబ్రవరిలో నెల్లూరుజిల్లా పంచాయితీ సంఘ సమావేశం జరిగింది. ప్రస్తుతంఉన్న మంత్రివర్గానికి కావలసిన కొంతమంది వ్యక్తులు, ఆ సమావేశంలో గలభా చెయ్యాలని చూచారు. దానితో తృప్తి పడక, ఒక rival organisation ను కూడ ఏర్పరచారు. I. L. B. గారు ఇక్కడకు వచ్చినతరువాత, నెల్లూరుజిల్లా పంచాయితీ సంఘానికి త్వరగా ఎన్నికలు జరిపించాలని order ను పంపించారు. ఇది ఈలా ఉండగా, ఈ ఆరుగురు మంత్రులు, నెల్లూరునుంచి తిరిగి ఇక్కడకు వచ్చినతరువాత, regional inspector గారి పర్యవేక్షణ క్రింద ఎన్నికలు జరగాలని, 20 వ తేదిన, ఒక order ఇవ్వబడింది. మళ్ళీ మొన్న దానికి భిన్నంగా ఇంకొక order ను వేశారు. ఈ విధంగా, అన్ని విషయాలలో అడుగు అడుగున, ప్రభుత్వముజోక్యం కలిగించుకోవడం జరుగుతున్నది.

అంతేగాక, కోడవలూరు పంచాయితీ ప్రెసిడెంటుమీద కొన్ని charges frame చేసి, అతనికి rules సరిగా తెలియవని, అసమర్థుడని అతనిని cash కూడ draw చెయ్యకుండాచేశారు. మరల ఆర్డరును రెండుమార్లు పొడిగించారు. ఇది చాలక ఒక తప్పుకు 4 మార్లు శిక్ష అన్నట్లు నాలుగవసారి ప్రెశిడెంటుపదవి నుండి తొలగిస్తూ రిమూవల్ ఆర్డరు పంపినారు. ప్రభుత్వం ఇచ్చిన చార్జిలో చూస్తే ప్రెసిడెంటు ఒక్క అణాకూడ తిన్నట్లు ఎక్కడాలేదు. ఈ విధంగా

action తీసుకోవడానికి ఏదైనా అతను wilful గా తప్పుచేశాడా అంటే అదీ లేదు. ఏదైనా wilful గా చేస్తే ఇటువంటి చర్యతీసుకోవాలని Act లో ఉండగా, Act కు విరుద్ధంగా ప్రెశిడెంటు పదవినుండి తొలగించారు. ఏవో చిన్నచిన్న చార్జీలు ఇచ్చారు. ఒక సందర్భంలో, రెండు, మూడు రోజులు, పంచాయితీ బోర్డు తాలూకు డబ్బు తనవద్ద పెట్టుకున్నాడని, ఆ చార్జీలో వ్రాయబడింది. అంతేకాకుండ, అక్కడ, 4, 5 వేల రూపాయలు కిమ్మత్తుచేసే భవనం, 12 వందల రూపాయలకు వస్తుందని, జిల్లాపంచాయితీ officer కు చెబితే, అతను అక్కడకు స్వయంగా వచ్చి, అన్నివిధాల నీకు మద్దతు ఇస్తానని చెప్పి, ఆ భవనాన్ని 12 వందల రూపాయలకు కొనిపించారు. అది ఒక కారణంగా తీసుకొని, "ఆ భవనాన్ని కొనేముందు నీవు Collector గారి అనుమతి ఎందుకు పొందలేదు" అని చార్జీ ఇచ్చారు. Member లకు notice లు ఇవ్వకుండా, meeting జరిపించాశని, ఆ చార్జీలోనే వ్రాయబడింది. మొన్న అక్కడ electricity సరఫరా ప్రారంభం చేసినప్పుడు, టెంకాయలు వగైరా చిన్నచిన్న ఖర్చులకు ఒక 10 రూపాయలు ముందు పంచాయితీ ఆమోదం లేకుండా ఎందుకు ఖర్చుచేశావని అడిగారు. వీటికి అన్నింటికీ, అతను explanation ఇస్తూ, కొన్ని కొన్ని rules తెలియనికారణంగా ఇవి జరిగాయని, wilful గా ఏదీ చెయ్యలేదని చార్జీలకు సమాధానం ఇచ్చాడు. అమలులో ఉన్న Act కు భిన్నంగా అతని removal కు వ్రాశారు.

ఈ విధంగా ఎన్నో విషయాలలో రోజురోజుకూ interference పెరిగి పోతున్నదని చెప్పక తప్పదు. దీనికి వెనుకనే, అవినీతి కూడ పెరుగుతున్నది. విచారణ జరిపిస్తే, ఇంకా ఎన్నో విషయాలు బయటపడుతవి.

ఈ నాడు ముఖ్యంగా ఈ అవినీతి, లంచగొండితనము అనునవి నారి కురుపు మాదిరిగా, 100 fold నుంచి 1000 fold కు పెరిగిపోతున్నది. ఇటీవల రాజీనామా ఇచ్చిన ఒక Bengal మంత్రి దీనినే ప్రధానంగా ఉదహరిస్తూ, దీనిని ఏ విధంగానూ నిర్మూలించడానికి వీలులేక "నేను రాజీనామా ఇచ్చి బయటకు వచ్చేస్తానని" చెప్పారు.

ఇక్కడ నల్లగొండ జిల్లా, nominated district board లో, రమారమి 12 లక్షల రూపాయలు నిలువ ఉన్నప్పటికీ, అక్కడి roads, schools ఎంత దురవస్థలో ఉన్నాయో మనకందరికీ తెలిసినవిషయమే. 12 లక్షల రూపాయలు నిలవ ఉంచుకొని, ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఉండి, ఆ బోర్డుకు Collector గారు, అధ్యక్షులుగా ఉంటూకూడ, పరిస్థితులు ఇంత అధ్వాన్నంగా ఉన్నాయంటే, ప్రభుత్వములో ఈ లోకల్ బోర్డులకు సంబంధించిన department లో ఎంత అసమర్థత ఉన్నదో గమనించాలని కోరుతున్నాను.

شری محبوب علی خان (Sri Mahboob Ali Khan) ـ جناب صدر ـ حکومت مقامی کے وزیر شری برہمانند ریڈی نے جو ڈیمانڈ پیش کئیے ھیں میں اوس کی تائید کرتے ہوئے چند باتین اون کے گوش گزار کرنا چاھتا ہوں۔ اوپل پہاڑ ایک قریہ ھے۔ وھان بھی انسان رھتے بستے ھین۔ وہ لوگ بھی حکومت کو ٹیکسس وغیرہ ادا کرتے ھین لیکن اسکے باوجود وھاں کے لوگوں کی ضروریات پوری نہین کی جاتین۔ وھان کی جو سڑک ھے اوسکی نہایت بری حالت ھے۔ وہ سڑک پتھروں اور گنڈ سے بھری پڑی ھے۔ اون کو صاف کرنے کے لئیے میں نے کئی مرتبہ پلاننگ کمیٹی میں اور ڈسٹرکٹ بورڈ میں توجہہ دلایا لیکن کوئی توجہہ نہین کی گئی اس لئیے اب مین وزیر حکومت مقامی کو توجہہ دلا رھا ھون کہ وہ اس سڑک کو ٹھیک کروائین۔ اس کے علاوہ اوجل واڑا سے نیتوڑ تک جو سڑک ھے اوسکی بھی حالت بہت خراب ھے۔ اوسکو بھی درست کیا جانا چاھئیے۔ کرنول کو سال گزشتہ نہ کوئی گرانٹ دی گئی اور نہ ھی کوئی لون دیا گیا۔ وھان واٹر سپلائی کا انتظام ٹھیک نہین ھے۔ حالانکہ کرنول ایک جزیرہ ھے لیکن اس کے باوجود وھان پانی کی ھمیشہ تکلیف رھتی ھے۔ منسٹر صاحب خود وھان تشریف لا چکے ھین۔ کیبنٹ کے دیگر وزراء بھی تشریف لاچکے ھین لیکن وھان پانی کی قلت دور کرنے کی طرف توجہہ نہین کی گئی۔ اس لئیے مین منسٹر صاحب سے گزارش کرتا ھون کہ وہ اس طرف ضرور توجہہ فرمائین۔

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : అధ్యక్షా, 15 లేక 16 మంది, గౌరవ సభ్యులు ఈ చర్చలో పాల్గొన్నారు. వారు అనేక విషయాలలో మంచి సూచనలు చేశారు. వారికి నా ధన్యవాదాలు. ప్రప్రథమంలోనే, యీ లోకల్ అడ్మినిస్ట్రేషన్‌కు సంబంధించినటువంటి అనేక శాఖల్లో, ఏయే కార్యక్రమాలు జరుగుచున్నవో మరియు తలపెట్టబడుచున్నవో, నేను వివరించి ఉన్నాను. ఇప్పుడు సభ్యులు చేసిన కొన్ని సూచనలకు నేను సమాధానము చెబుతాను. నాగిరెడ్డిగారు, యింకా యితర సభ్యులు, ముఖ్యముగా అప్పారావుగారు వగైరాలు, ఈ జిల్లాబోర్డులు ఎంతకాలము స్పెషల్ ఆఫీసర్స్ పరిపాలనక్రింద ఉండవలెనని అన్నారు. కాని నేను ఇదివరకే White paper లో మనవి చేసిన ప్రకారము, ఇపుడు రామక్రిష్ణరాజుగారు శెలవిచ్చిన ప్రకారము వెనుక ఉన్నటువంటి జిల్లాబోర్డులు మంచి కార్యక్రమమును నిర్వహించినప్పటికీ ప్రస్తుత పరిస్థితులలో ప్రస్తుతమువున్నటువంటి intensive development programmeలో "they have outlived their utility" అనేది నిర్వివాదాంశము అని అందరికీ తెలుసును. అందుకని Special officers ను continue చేస్తున్నామని భావించరాదు. వారికి White paper లో 5 వ పేజీలో Blocks ఏర్పరుస్తామని ఉంది. ఎక్కడైతే Blocks లేకపోతాయో అక్కడ District Councils పెడతామని

యిపుడు జిల్లాబోర్డులు నిర్వహిస్తున్నటువంటి కార్యక్రమాన్ని అవి నిర్వహిస్తాయని నేను మనవి చేస్తున్నాను. 12 వ para లో ఈ విధంగా ఉంది.

"In areas which are not covered by Blocks, the new District Council will discharge the functions of the District Board until a Block Council takes over such functions". ముఖ్యమైనటువంటివిషయమేమిటంటే వున్న బ్లాకులకు బ్లాక్ councils ఏర్పాటు చేయాలి. ఇది కొంతకాలము పట్టుతుంది. కాబట్టి ఉన్నటువంటి District Boards ను District conncils replace చేయాలని white paper లోనే చూపివున్నాము. యీ Block Councils లో శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు ఎన్నికైనటువంటి non-offical సభ్యులు వుంటారని నేను మనవి చేశాను. కాబట్టి special officers regime continue అవుతుందని అనుకోడానికి ఆస్కారములేదు. దురదృష్టవశాత్తు అందరికీ తెలువు అగపడితే మన శ్రీరామమూర్తిగారికి నలుపు అగుపడుతుంది. వారు white paper చూచారో లేదో. దానిలో revenue divisional officers Block Councils కు chairmen గా వుంటారని చెప్పారు. అటువంటి idea ఆయనకు ఎందుకొచ్చిందో నాకు తెలియడము లేదు. బహుశా బల్ వంత్ రాయి మెహతా కమిటీ report చూచి వారు భ్రమపడి వుండవచ్చును. దానిలో ఆ సూచన వున్నది కాని ఈ ప్రభుత్వము ఆ సిద్ధాంతాన్ని అంగీకరించడము లేదు. యీ Block councils కు non-officials Chairmen గా ఉండాలని అన్నాము. ప్రజా విశ్వాసాన్ని సంపాదించుకొని అందరి ప్రజలచే ఎన్నుకొనబడినటువంటి పంచాయితీ అధ్యక్షులు సభ్యులుగావుండి వారు ఎన్నుకొనినవారే Block Councils అధ్యక్షులుగా వుంటారన్నాము.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : వారు పొరపాటుగా మాట్లాడి వుండవచ్చును. ఇపుడు వున్న Block Committees కు R. D. O. President గా వున్నాడు. Block Committee లలో M. L. As వున్నారు. M. L. As. వుండవలసిందనేటటువంటి అభిప్రాయము ఇదివరకు గవర్నమెంటువారు వెలిబుచ్చారు. దీనినే అమలుపరుస్తారని బహుశా వారు అభిప్రాయపడివుండవచ్చును.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : నేను ఊహాగానము చేయలేనండి. శ్రీరామమూర్తిగారిది ఈ అభిప్రాయమని నాకు తెలియదు. వున్నటువంటి పరిస్థితి ఏమిటంటే Block Advisory Committees ఉన్నవి. ఎపుడైతే యీ Block Councils statutory గా వస్తాయో అపుడు automatic గా Block Advisory Committees పోతాయి. తర్వాత శ్రీరామమూర్తిగారు ఇంకొకటి చెప్పారు. జిల్లా బోర్డులకు ఎన్నికలు జరుపడము లేదని, ఎన్నికలకు భయపడ్డారని చెప్పారు. ఎంత పొరపాటు! నేను చూచినంతవరకూ సోషలిస్టు సభ్యుడు ఎక్కడాలేడు.

ఎన్నికలకు భయపడడమనే ప్రశ్నే లేదు. అసలు మనము ఏమాదిరిగా ప్రభుత్వానికి స్థానిక పంచాయితీలకు మధ్య వుండవలసినటువంటి సంస్థకు ఏ రూప మివ్వాలి, ఏ రూపవములో ఇస్తే బాగుంటుంది, ఏమి అధికారాలు ఇవ్వాలి, Decentralisation ఎంతవరకు effect చేయాలి, ఎన్ని powers ను delegate చేయాలి అన్నదే మాట కాని తడవ తడవకూ ఎన్నికలు పెట్టినంతమాత్రాన అది మంచి ప్రజాస్వామిక మనిపించుకోదు అని నేను మనవిచేస్తున్నాను. ఒక సభ్యుడు మా కాంగ్రెస్ తరఫునుంచి మాట్లాడుతూ చెప్పారు. ఈ Intermediary Bodies కు Indirect Elections వుంటే మంచిదన్నారు, ఎన్నుకోవలసినవాండ్లే యీ సంస్థలు నిర్వహిస్తారు కాబట్టి Indireet Election అనే మాటే రాదు. తర్వాత శ్రీరామమూర్తిగారు చెప్పారు. ఈ Block Councils ఏర్పాటు చేసుకోవడము కాంగ్రెస్‌ను బలపరుచుకోడానికని వారి మనుష్యులను తీసుకొచ్చి పెట్టడానికి అని. దురదృష్టవశాత్తో అదృష్టవశాత్తో ప్రజల విశ్వాసము కాంగ్రెస్‌పట్ల వుంటే అది ఎన్నడు తప్పించుకోలేము అని మనవిచేస్తున్నాను. నాగిరెడ్డిగారు మాట్లాడుతూ విజయవాడ వార్డ్సు డివిజన్ సంగతి చెప్పారు. నాగేశ్వరరావు గారు కూడా చెప్పారు. దానినిగురించి ఎక్కువ విషయాలను చెప్పనవసరము లేదనుకుంటాను. ఎందుకంటే 1956 సంవత్సరంలో ఏదో ఒక విధంగా వార్డు డివిజన్ చేశారు. అక్కడ ఒక కమిటీ వుంటే దానిని అతిక్రమంచి దాని సలహా పొందకుండా చేశారు. సంకుచితంగా చేశారని ఫిర్యాదులుకూడా వచ్చాయి. దానిని దిద్దాలని ఏర్పాటులు చేసినతర్వాత నేను మొన్న ఒక ప్రశ్నకు జవాబు చెప్పుతూ దానిని చక్కపర్చడానికి ఏదైనా వీలుంటే గౌరవ సభ్యులుకాని ఇతరులుకాని అభిప్రాయాలిస్తే చక్కదిద్దడానికి సిద్ధంగావున్నానని మనవిచేశాను. యీ విషయంలో హైకోర్టుకు పోవడము, అది రద్దుకావడము-అదంతా నేను చెప్పనవసరములేదు. ఇంకొక విషయము. అంతమంది సభ్యులు, ఆర్థికమంత్రిగారు కూడా వినడము మంచిదేమో. ఈ పంచాయితీలయొక్క ఆదాయము అంత ఎక్కువగా లేదు. ఏవిధముగానైనా ప్రభుత్వము కొంచెము ఆర్థిక సహాయముచేసి వీటి పరిస్థితిని బాగుచేయాలని చెప్పారు. వారితో నేను సంపూర్ణముగా ఏకీభవిస్తున్నాను. ఐతే పరిస్థితులదృష్ట్యా మన State కు వున్నటువంటి finances ను బట్టి యీ పంచాయితీలకు సహాయం చేయడమనేది వీలు అవుతుందికాని వేరే కాదని మనవిచేస్తున్నాను. తర్వాత నాగిరెడ్డిగారు, శంకరయ్యగారు, కమ్యూనిస్టుపార్టీవారంతా కూడా secret ballot కావాలని చెప్పారు. తెలంగాణా ప్రాంతములో secret ballot వున్నదని కూడా చెప్పారు. ఆంధ్ర ప్రాంతములో కూడా Class I పంచాయితీలకు, తర్వాత ఎక్కడైనా తగాదాలు వున్నచోట్లకు ఇప్పటికి secret ballot వున్నది. కాని ఇన్ని స్థలాలలో secret ballot వుంటే ఎంత ఖర్చు ఔతుందో మీరే చూడండి. అప్పుడే సభ్య

లంతా చెప్పారు. వీటికి ఆర్థిక పరిస్థితులు చక్కగాలేవు అని. ఈ చిక్కులలో ఎన్నికలు జరుపడంకొరకు ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడములో న్యాయముకాదు. అందుకని ఇప్పుడు వున్న పద్ధతినే continue చేయాలని దానిలో ఏమి మార్పు లేకుండా వుండాలని ప్రభుత్వముయొక్క ఉద్దేశము. తెలంగాణాలో కూడా ఒక పద్ధతి ఉంది. తెలంగాణా ప్రాంతానికి సంబంధించినంతవరకూ గ్రామ సభ ఒకటి వున్నది. గ్రామ సభలో నిర్ణయమైతేనే తప్ప అది secret ballot లేక open ballot అని తేల్చడానికి వీలులేదు అందుకని అక్కడవున్న పంచాయి తీలకు secret ballot వున్నదనడము పొరపాటు. ఇంకొకటి చాల dangerous సలహా నాగిరెడ్డిగారు ఇచ్చారు. పంచాయితీలలో కూడా no-confidence motion కు provision వుండాలని చెప్పారు. నేను దీనితో ఏమాత్రము ఏకీభ వించను. ఇపుడువున్న పంచాయితీలు శైశవావస్థలో వున్నవి అభివృద్ధిలోనికి తీసుకురావలసినటువంటివాటిని no-confidence తీసికొచ్చి తికమకపెట్టడము ప్రభుత్వముయొక్క ఉద్దేశముకాదు. ఈ సందర్భములో హనుమంతరావుగారు ఒక చక్కని సూచనచేశారు. పంచాయితీ ఎన్నికలకు సంబంధించినంతవరకు ఒక పార్టీ ప్రయోజనాలకని ఎన్నికలు జరుపకపోవడము చాల మంచిది. ఏ కులానికిచెందినా ఏ మతానికిచెందినా అక్కడ వున్నటువంటి పెద్దలు ఆ కార్య నిర్వాహక బాధను నెత్తిన పెట్టుకోవడము చాల మంచిదికాని పార్టీ కలతలు తీసుకొచ్చి గ్రామములో పెట్టితే అది చాలా dangerous గా వుంటుంది. అన్నిపార్టీలవారిచ్చిన సలహాను అంగీకరించి ఆ విధంగా చేసినట్లయితే యీ పంచాయితీ సంస్థలకు ముందు భవిష్యత్తు వుంటుందికాని నాగిరెడ్డిగారు, శంక రయ్యగారు చెప్పిన ప్రకారం జరిగితే అది చాల ప్రమాదంగా వుంటుంది.

శ్రీ నాగేశ్వరరావుగారు మాట్లాడుతూ ఈ డిమాండులో ఇతర పద్దులు కూడా చేర్చారు అని అన్నారు. ఆ విషయం నిజమే. ఈ విషయమై విచారణ కూడా చేశాము. ప్రత్యేకమైన డిమాండు పెట్టాలి అన్నప్పుడు అనేకరకాలుగా ఆనేక Heads క్రింద కలిసిఉన్నవి కాబట్టి ఫైనాన్సు శాఖవారి ఆక్షేపణ వచ్చి నది. దానిని ప్రత్యేకంగా పెట్టాలంటే ఆడిటర్ జనరల్ యొక్క అనుమతి కావాలనికూడా మావిచారణలో తేలినది. వచ్చేసంవత్సరానికైనా సరిదిద్దుకుని ప్రత్యేకమైన డిమాండుగా, miscellaneous మొదలైనవి లేకుండా ఏర్పాటు చేయడానికి అవకాశం ఉంటుందని ఆశిస్తున్నాను. శ్రీ నాగేశ్వరరావుగారు గోదావరిగట్టు వెడల్పు చేయడం గురించి చెప్పారు. గోదావరి గట్టును వెడల్పుచేస్తుంటే ఆయనకు ఎందుకు బాధకలుగుతున్నదో నాకు అర్థంకావడం లేదు. మునిసిపాలిటీవారు తమ డిపార్టుమెంటుద్వారా పనిచేయిస్తామన్నారు. ఒక సంస్థ చేయిస్తున్నది; వ్యక్తికాదు. స్థానికసంస్థ మా డిపార్టుమెంటుద్వారా చేయిస్తాము; ఏమైనా ఒక రూపాయిలాభంవస్తే జమకట్టుకుంటాము; యే

కంట్రాక్టరుకో ఇవ్వవద్దుఅంటే, లేదు, కంట్రాక్టరుకే ఇవ్వాలని శ్రీ నాగేశ్వర రావుగారు అంటున్నారు. అందులో వారు రాజమండ్రివారు. ఇందులోని గూఢార్థమేమిటో నాకు తెలియదు. ఆ సంగతి ఏమో చూస్తేనేకాని చెప్పలేను, అధ్యక్షా, శ్రీ అప్పారావుగారు మాట్లాడుతూ వారి పాలకొండ పంచాయితీ విషయము, నీటి విషయము మాట్లాటారు. నిజంగా ఇప్పుడు మాట్లాడవలసిన విషయంకాదు. మొన్ననే మనవిచేసి ఉన్నాను. ఈ అయిదు సంవత్సరాలలో గ్రామీణ, పట్టణ నీటివధకాలగురించే (Rural water supply schemes and Urban water supply schemes) వాటి వివరాలన్నీ మనవిచేసి ఉన్నాను. ఏమైనా వీలుంటే, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పాలకొంఢకు ఈ స్కీము రావడానికి ప్రయత్నం చేసుకోవచ్చును. మరొక విషయం. వారు పంచాయి తీలను గురించి కొంచెం నిరసనగా మాట్లాడారు. చాలా బాధ వేసినది, అధ్యక్షా అసలు మన భవిష్యత్తు అంతా పంచాయితీలలో ఉన్నదని పదే పదే మనవి చేస్తున్నాను. వీటిలో కొన్ని లోపాలున్నా సరిదిద్ది వాటిని సక్రమమైన పద్ధతిలో పెట్టవలసిన బాధ్యత ఈ సభవారియందున్నది. ఏవో తగాదాలున్నాయన్నారు. ఎక్కడ తగాదాలు లేవు. అధ్యక్షా, తొమ్మిదివేల పంచాయితీలు పైచిలుకు ఆంధ్రరాష్ట్రంలోఉంటే ఏడువేల పంచాయితీలపైచిలుకు ఏకగ్రీవంగా ఎన్నికలు జరుపుకున్నాయి. కొన్నిచోట్ల తగాదా లున్నంతమాత్రాన system of administration - పంచాయితీరాజ్యం అన్న పదాన్ని తీసివేయడం చాలా dangerous అవుతుంది; ప్రజాస్వామికానికే దెబ్బఅని మనవిచేస్తున్నాను. శ్రీ జాలయ్యగారు అనుభవంకలిగినవారు, ఒక పెద్ద పురపాలక సంఘానికి చాలా కాలం అధ్యక్షులుగా పనిచేసినవారు. వారుకూడా కొన్నిసూచనలు చేశారు. ముఖ్యంగా integration of laws విషయంలో అనుభవం ఉన్నవారితో ఒక కమిటీని వేయాలని అన్నారు. తప్పకుండా జరుగవలసినదే. మునిసిపల్ పంచాయితీ చట్టాల సమన్వయం (integration) వచ్చినపుడు సభవారిముందు బిల్లును ప్రతిపాదించినపుడు సెలక్టు కమిటీకి పంపవలసి ఉంటుంది. అందులో అన్ని పార్టీలనుండి అనుభవం కలిగిన వారిని సభ్యులుగా తీసుకుని అన్ని విషయాలను చర్చించుకుని మనం నిర్ణయా లను తీసుకోవలసి ఉంటుంది. అందులో ఏమీ ఆక్షేపణ ఉండదు. పట్టణాలలో encroachment విషయమై ఉన్న ఇబ్బందులను గురించి చెప్పారు. కోర్టులకు అధికారం లేకుండా చేయాలని అన్నారు. అది సాధ్యం కాదేమో. ఈ విషయం ఈ మధ్య విచారణ చేశాము. హైకోర్టు వారినికూడా consult చేశాము. వారి అభిప్రాయం సాధారణంగా కోర్టు అధికారాలలో కలుగచేసుకోకుండా ఉంటే మంచిదేమో అని, అదే పలవో వారిచ్చారు. ఇంకా తుది నిర్ణయం ఏమీ చేయ లేదు. Ientegration విషయంలో ఆలోచించవచ్చును. గుంటూరు నీటి సరఫరా స్కీము గురించి చెప్పారు. ఒకటి, రెండు మాసాలలో పని పూర్తి అవుతుంది.

106 లక్షల రూపాయిలు ప్రభుత్వం ఖర్చుచేసి ఈ ప్రణాళికను పూర్తిచేసినది. డ్రయినేజి కూడా కావాలన్నారు. నిజంగా పెద్దపట్టణం; రావలసినదే. కేంద్ర స్థానంలో ఉన్నది, ద్వితీయ ప్రణాళికలో ఏమైనా వీలుంటే ఆలోచించవచ్చును. నేనూ ఆ ఊరువాణ్ణే. ఇంకా ఎక్కువ శ్రద్ధ వహించడం న్యాయం కాదేమో. అయినా పరిశీలన చేస్తాను. మరొక సూచన చేశారు. అది స్థానిక స్వపరిపాలనకు సంబంధించిన విషయం కాదు. కౌన్సిలు సభ్యులుగా అందరు స్త్రీలనే పెట్టాలని అన్నారు. నిజంగా అది సాధ్యమే అయితే పై సభలో వారుండడం మంచిదే. మరొక విషయం, మునిసిపాలిటీలలో high ways రోడ్లున్నాయి. అవి మునిసిపాలిటీలకు బదిలీ (transfer) కాలేదు. వాటి మరమ్మతుల విషయం మునిసిపాలిటీలకు సంబంధం లేకుండా ఉన్నది. ఆ రోడ్లమీద ఉండే encroachments విషయమై కొన్ని ఇబ్బందులు వస్తున్నాయి. వాటిని తొలగించడానికి ప్రయత్నం చేస్తాము. శ్రీరామమూర్తిగారు మాట్లాడుతూ రాజ్యాంగంలోని 40 వ ఆర్టికిలును చదివారుఎవరికి తెలియదేమో అన్నట్లు; అందులో పంచాయితీలను ఏర్పాటు చేయాలని అన్నారేకాని బ్లాకు కౌన్సిళ్ళ యొక్క ప్రమేయమేలేదు. ప్రతి గ్రామానికి పంచాయితీని ఏర్పాటు చేయాలి; వాటికి సక్రమమైన అధికారాలు అప్పగించాలని చెప్పారే కాని....

శ్రీ బి. శ్రీరామమూర్తి : పాయింట్ ఆఫ్ ఆర్డర్, సర్, ఆర్టికిలు 40 లో "The State should take steps to organise......

*Mr. Speaker :* It is not a point of order.

*Sri B. Sreeramamurty :* It is against the constitution, Sir.

*Mr. Speaker :* It is not against the constitution. There is no point of order.

శ్రీ బి. శ్రీరామమూర్తి : నేను చెప్పేది వినకుండానే లేదంటే ఎట్లా ?

మిస్టర్ స్పీకర్ : మీరు రాజ్యాంగానికి వ్యతిరేకమని అన్నారు. లేదని నేను రూలింగ్ ఇచ్చాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి : బ్లాక్ కౌన్సిళ్లను గురించి మనవి చేస్తున్నాను. విని రూలింగు ఇవ్వండి. White paper లో స్పష్టంగా ఒక వాక్యం ఉన్నది; పంచాయితీల తాలూకు బడ్జెటులను modify చేయడానికి బ్లాక్ కౌన్సిళ్లకు అవకాశం ఇచ్చారు. బడ్జెటును modify చేయడానికి అవకాశంఉంటే పంచాయితీలు self-governing unitsఎట్లా అవుతాయి ?

*Mr. Speaker :* I am not concerned with the White Paper. రాజ్యాంగం ప్రకారం సరిగా ఉన్నది. అందుచేత పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేదు.

పాయింట్ ఆఫ్ ఆర్డర్ అనడంతోనే sacredness వస్తుందని మీ ఉద్దేశం, అది చెడు అలవాటు. I am going to discourage it.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : దురదృష్టవశాత్తు శ్రీరామమూర్తిగారు confusion లో ఉన్నారు.

మిస్టర్ స్పీకర్ : చెప్పండి ; గట్టిగా చెప్పండి.

శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి : ఏమైనా తమరే ఆ విషయాన్ని ఖండించారు. కాబట్టి జవాబు చెప్ప నవసరంలేదు. బాగారెడ్డిగారు చక్కగా ఉపన్యాసం చేశారు. తెలంగాణా ప్రాంతంలోని పంచాయితీలు inactive గా ఉన్నాయని అన్నారు. నిజమే ఆ మాట. దానికి కారణాలుకూడా వారే చెప్పారు. మనకూ తెలిసినవే. ఆంధ్ర ప్రాంతంలో పంచాయితీలు పుట్టడం, పెరగడం చాలాకాలం నుంచి జరుగుతున్నది. తెలంగాణాలో ఇటీవలనే వచ్చాయి. ఆంధ్ర ప్రాంతంలో కూడా పంచాయితీలు ఏర్పడిన క్రొత్తలో ఇదే స్థితిలో, ఇదే అవస్థలో ఉన్నాయి. ఇటీవలనే మూడు నాలుగు సంవత్సరాలనుంచి active గా ఉంటూ కార్యక్రమాలలో పాల్గొనడం జరుగుతున్నది. ముఖ్యమైనకారణం వారు చెప్పారు, తగినంతమంది ఉద్యోగస్థులులేరని. తమకు తెలిసినవిషయమే. ఆంధ్రప్రాంతంలో ప్రతితాలూకాకు ఒక డిప్యూటీ పంచాయితీ ఆఫీసరు ఇనస్పెక్షన్ చేస్తుండడం, సలహాలు ఇస్తూండడం జరుగుతూ ఉంటుంది. తెలంగాణాలో కొన్నిచోట్లతప్ప అటువంటి ఏర్పాట్లులేవు. కావలసిన పరిపాలనాసిబ్బంది, ఇంజనీరింగ్ సిబ్బంది లేకుండా ఉన్నారు. ఈ సిబ్బందిని పెంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని మనవిచేస్తున్నాను.

జహీరాబాదు తాలూకాకు రిప్రెజంటేషను లేదన్నారు. కాని ఇప్పుడు మన మేమీ చేయలేము. హైద్రాబాదు చట్టం 1956 లో అమలులోనికి వచ్చినది కాబట్టి ప్రభుత్వం ఎవరిని నామినేటు చేసే అధికారం లేదు. ఆ ఆక్టులోని రూలు ప్రకారం కొత్త ఆక్టు అమల్లోకి వచ్చేవరకు పాతబోర్డులు కంటిన్యూ అవుతాయని ఉన్నది. ఆ రెండు తాలూకాలకు జిల్లాబోర్డులో రిప్రజెంటేషను ఇవ్వలేమేమోనని అనుకుంటున్నాను. ఒక రోడ్డునుగురించి ఆసుపత్రినిగురించి వారు చెప్పారు. నాకు వ్రాశారుకూడ. దానిపైన ఇంజనీరును పంపి దర్యాప్తు చేయించాము. వీలైనప్పుడు దానినిగురించి మనవిచేస్తాను. శ్రీ హనుమంతరావుగారు స్థానిక సంస్థల ఆర్థిక పరిస్థితి బాగుచేయాలని ల్యాండు రివిన్యూలో ఒక భాగం ఆ సంస్థలకివ్వమని చెప్పారు. వారితో నేను ఏకీభవిస్తున్నాను. ఐతే ఎప్పుడు ఎంత చేయగలమనేది రాష్ట్రి అర్థిక సౌష్ఠవంమీద ఆధారపడి ఉంటుంది. ఏమయినప్పటికినీ కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు పంచాయితీలకు సాధ్యమైనంత వరకు ఎక్కువ సహాయం చేయవలసిన అవసరమెంతో ఉన్నదని మనవి చేస్తున్నాను. తెలంగాణాలోని జిల్లా బోర్డులలో స్టాఫ్ తక్కువని చెప్పారు.

తెలంగాణా జిల్లా బోర్డులలో ఉన్న డబ్బును సక్రమంగా ఖర్చుపెట్టించవలెనని చెప్పారు. గ్రామాలలో స్కూల్సు ఏర్పాటుచేయుటకు, రోడ్లు వేయించుటకు ప్రభుత్వానికెట్టి అభ్యంతరం లేదు. ఈ పనులు తొందరగా జరుగవలెనని ప్రభుత్వం ఆశిస్తున్నది. ఈ మధ్య ప్రభుత్వం 93 - 94 రూరల్ డిస్పెన్సరీలను ఏర్పాటు చేయడం జరిగింది. వీటిలో జిల్లాబోర్డులు ఒక భాగం భరించటానికి ప్రభుత్వం అంగీకరించింది. జిల్లాబోర్డు సభ్యులు ఇంకా ఎక్కువ శ్రద్ధతీసుకుని డబ్బు ఖర్చు పెడితే బాగుంటుందంటున్నారు. శ్రీ మేకా కోటిరెడ్డిగారు కొన్ని రోడ్ల గురించి చెప్పారు. గ్రామీణ ప్రాంతాలపై దృష్టి కేంద్రీకరించాలని అన్నారు. జిల్లా బోర్డులలో జరిగే కార్యక్రమం, పంచాయితీలలో జరిగే కార్యక్రమం కమ్యూనిటీ డెవలప్‌మెంటు కార్యక్రమం రూరల్ వాటర్‌సప్లయి కార్యక్రమం మొదలయినవన్నీ గ్రామస్థులకే ఉపయోగపడుతున్నవి. ముందుముందు గ్రామీణ ప్రాంతాలు ఇంకా ఎక్కువ ప్రాముఖ్యానికి వస్తాయి. ప్రభుత్వానికి సంబంధించి నంతవరకు యీ విషయంలో వ్యతిరేకత ఏమీలేదు. నిర్లక్ష్యభావం కూడ లేదు. శ్రీ మాధవరావుగారు మాట్లాడుతూ తెలంగాణాలో లోకల్ బోర్డ్సును సక్రమంగా నిర్వహించాలని వాటిని ఒక స్థాయికి తేవాలని చెప్పారు. ముఖ్యంగా స్టాఫ్‌ను ఎక్కువచేయాలన్నారు. నేను అంగీకరిస్తున్నాను. శ్రీ చంద్ర ఓబులరెడ్డిగారు మాట్లాడుతూ వారి నాయకులవలెనే సీక్రెట్ బాలట్ పద్ధతిలో ఎన్నికలు జరుగవలెనన్నారు. అది వారి పార్టీ దృక్పథం కావచ్చు. ఎన్‌క్రోచ్‌మెంటు విషయంలో పత్తికొండ మ్యునిసిపాలిటీవారు జోక్యం పుచ్చుకున్నారని చెప్పినప్పుడు జాయింటు డైరెక్టరును పంపి విచారణ జరిపించాము. వారి రిపోర్టు వచ్చింది. ప్రభుత్వం ఆ నివేదికను పరిశీలించి చర్య తీసుకుంటుంది. ఇంకా వేరే కంప్లయింట్సు ఉన్నట్లయితే, చెప్పితే తప్పకుండా విచారణ చేయిస్తాను. పెద్దలు రామకృష్ణరాజుగారు జిల్లాబోర్డులకు బదులు బ్లాకు కౌన్సిల్సు ఏర్పాటుచేసే విషయాన్ని బలపరచారు. వారికి నా ధన్యవాదాలర్పిస్తున్నాను. శ్రీ హయగ్రీవాచారిగారు తెలంగాణాలో పంచాయితీలకు 15 వ వంతు ఆదాయమివ్వడంలేదన్నారు. 24-9-56 న 47,799 రూపాయలు పంచాయితీలకిచ్చారు. ఇంకా 2,81,803 రూ.లు ఇవ్వవలసి ఉన్నది. అదికూడ ఇవ్వడానికి ప్రయత్నిస్తామని మనవిచేస్తున్నాను. ఈ సంవత్సరం బడ్జటులో 5,22,600 రూ.లు దీని నిమిత్తం కేటాయించబడిందని మనవిచేస్తున్నాను. నరసింహారెడ్డిగారు మాట్లాడడానికి టైములేక వారు వాటరు సప్లయి స్కీమునుగురించి ఒక రోడ్డు గురించి...... ఒక కాగితం పంపారు. దానివిషయమై ఆలోచిస్తాను. గౌరవ సభ్యులు ఇచ్చిన సలహాలకు వారికి నా నమస్కారములు తెలుపుతూ యీ డిమాండును డివిజను లేకుండా పాస్ చేయమని కోరుతున్నాను.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To criticise the Government in contemplating the abolition of District Boards.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To impress upon the Government to introduce District Councils with power on all departments in the District and of the District Boards with elected Chairman.)

The motion was negatived.

*Sri Vavilala Gopalakrishnayya*: I demand a division Sir.

The House then divided

Ayes 31. Noes 107.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To criticise the Government policy in not granting the grants to the District Board for the year shown in the Educational Grant.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(టోలు, గేట్లు ఆపుదల అనగా రద్దు చేయకనే టాక్సులు వేసినందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పురపాలక సంఘాలకు పన్నులు చెల్లించి తర్వాత, ప్రతిచోట టోలు టాక్సులు వసూలుచేసే పద్ధతి తెల్పినందుకు)

The motion was negatived,

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(గ్రామపంచాయితీలకు లాండు రెవిన్యూ నుంచి 15 శాతము కేటాయించి యివ్వనందులకు.)

The motion was negatived.

*Sri G. Ganga Reddy*: I demand a division Sir.

The House then divided.

Ayes 31: Noes 107.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(టౌను కమిటీలు మరియు మున్సిపల్ కమిటీలు చట్టప్రకారము రద్దు చేయనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జోగిపేట టౌను కమిటీలో రు. 40,000 శిలకు డబ్బు యున్నను సంవత్సరాలనుండి డ్రైనేజ్ సమస్యను ఆపినందుకు ప్రభుత్వ విధానమును విమర్శించేందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జోగిపేట టౌను కమిటీకి ఫర్నిచరు గురించి 5 సంవత్సరాలనుండి వ్రాసినను సప్లయి చేయలేని ప్రభుత్వ విధానమును విమర్శించగలందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జోగిపేట పురపాలక సంఘమునకు సంవత్సరములనుండి డస్ట్‌బిన్సు సప్లయి చేయనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జోగిపేట తౌనుకమిటీద్వారా కేంద్రప్రభుత్వముచే నొసంగబడు డబ్బుచే యింతవరకు డాంబరురోడ్లు గ్రామములో చేయించనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To discuss the failure of the Government to reconstitute District Boards with elected representatives.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(ప్రొద్దుటూరు మునిసిపల్ ఉద్యోగుల నిర్లక్ష్య పక్షపాత చర్యలను ప్రభుత్వము అరికట్టనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(అల్లూరు, బుచ్చిరెడ్డిపాలెం క్లాస్ 1 పంచాయితీలలో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకోకుండా పరిపాలన సక్రమంగా సాగడానికి వీలులేకుండా చేసినందులకు.)

The motion was negatived.

*Ms. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(మానెగుంటపాడు పంచాయితీలో వున్న 1. మానెగుంటపాడు, 2. రామన్నపాలెం. 3. అర్లపాడు రెవెన్యూ గ్రామాలను విడగొట్టి ఆ మూడు గ్రామాలకు వేరువేరుగా పంచాయితీలను స్థాపించమని ఏకగ్రీవంగా మానెగుంటపాడు పంచాయితీ తీర్మానించినప్పటికీ యింతవరకు వారు కోరినవిధంగా 1. మానెగుంటపాడు 2. రామన్నపాలెం 3. అర్లపాడు గ్రామాలకు పంచాయితీలను స్థాపించనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు పురపాలక సంస్థలో చేరిన చెట్టుగుంటరోడ్డు ఉత్తరముగానున్న హరిజనులకు కాలవదాటుటకు వంతెన ఏర్పాటు చేయకున్నందుకు.)

The motion was negatived.

*Mr. Speakcr :* The question is :

To reduce the allotmcnt of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు పురపాలక సంఘము సరిహద్దులలోనున్న నరుకూరుగేటువద్ద కుసుమ హరిజనపాలెం హరిజనులకు గృహవసతి ఏర్పాటు చేయుటలో జాప్యం జరుగుచున్నందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు పురపాలక సంఘ సరిహద్దులలోనున్న ముత్యాలపాలెం గ్రామ హరిజనులకు ఇండ్లస్థలములకు యిచ్చివున్న అప్పు రద్దు చేయనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96 400 for
Local Administration by Rs. 100

(నెల్లూరు మునిసిపల్ కమిషనర్ వారు గవర్నమెంటు లెటర్ నెం. 27311-2-56-57 ఆరోగ్యము-తే. 7-8-56 ది. మేరకు పిండిమిల్లుల మీద ఏమిచర్య తీసుకొన్నది యింతవరకు తెలుపనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(నిర్మల్‌లో పురపాలక సంఘానికి స్లమ్‌క్లియరెన్సు కొరకు తగిన ధన సహాయము చేయలేనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(కేంద్రప్రభుత్వ సలహా ప్రకారము జోగిపేట పురపాలకసంఘము 4 పాకీదొడ్లు కట్ట నిర్ణయించినను ప్రభుత్వము ఆజ్ఞ యివ్వకపోవు విధానము విమర్శించగలందులకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జోగిపేట పురపాలక సంఘము పశు విక్రయ సుంకము విధించదలచినను ప్రభుత్వము ఆజ్ఞ నొసంగని విధానమును విమర్శించగలందులకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(టౌను ప్లానింగు గురించి 7 సం.ల నుండి జోగిపేట పురపాలకసంఘము కృషి చేయుచున్నను ప్రభుత్వము మూకీభవించు విధానమును ఖండించగలందులకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జోగిపేట టౌను కమిటీలో రు. 40,000 డబ్బు యుండి వాటర్ సప్లయి గురించి 5 సం. ల నుండి కోరినను ప్రభుత్వం చేయనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(వరంగల్ జిల్లాలో పంచాయితీల స్థాపన ముఖ్యంగా గత 2 సం. లలో ఏమీ చేయనందుకు విమర్శించుటకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(పంచాయితీ చట్టం ప్రకారం వాటికివ్వవలసిన రెవెన్యూ భాగాన్ని యివ్వకపోవటాన్ని విమర్శించుటకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(స్థానిక స్వపరిపాలన సక్రమముగా జరుగుటకు అవసర చర్యలు తీసుకోనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(పంచాయతీ గ్రామములపై తగు శ్రద్ధ వహించనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(ఆంధ్ర తెలంగాణాలలోగల పంచాయితీ ఆక్టులను నేటివరకు సమన్వయ పరచి ఒక నిర్దిష్టమయిన శాసనమును చేయుటలో విఫలమయినందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(జిల్లా బోర్డుల కార్యక్రమము బాగులేనందున.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for Local Administration by Rs. 100

(ప్రొద్దుటూరు మునిసిపాలిటీలోని అవకతవకలను అసమర్థతను ప్రభుత్వ దృష్టికి తెచ్చుటకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(జిల్లా బోర్డులకు ఎన్నికలు జరుప నిరాకరించుతున్నందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reducc the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(గ్రామ పంచాయితీలకు నిధులను సమకూర్చుటలోనూ, వాటి బడ్జెట్లను మంజూరు చేయుటలోనూ వాటి ప్రణాళికలను ఆమోదించకపోవడం మొదలగు ప్రజాతంత్ర వ్యతిరేక పద్ధతులు అనుసరిస్తున్నందులకు.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పంచాయితీ కమిటీలకు ప్రచారశాఖనుండి ఆంధ్రప్రదేశ్ సమాచార పత్రిక, గెజిట్సు పంపించు ఏర్పాట్ల గురించి చర్చించుటకుగాను.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(పంచాయితికమిటీలకు సంబంధించిన ప్లానింగుశాఖ సూచనలను, ఆర్డర్సు గైడెన్సును పంచాయితీ కమిటీలకు అందించకపోవడం గురించి చర్చించుటకుగాను.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To discuss the failure of the Govt. to establish District Councils duly elected by the people on adult franchise, for the purpose of running the administration at the District level and also with a power to spend plan money and exercise control and power over police.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(To discuss the failure of the Government to allot ¼th of the Land Revenue to Village Panchayats.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(For not holding elections in Local Bodies where their terms ended.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(For not giving adequate representation to all the parties in the nomination of district boards in Telangana.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Administration by Rs. 100

(For not sanctioning grants to Panchayat Committees in time.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 46,96,400 for
Local Adminstration by Rs. 100

(నల్లగొండ జిల్లాబోర్డులో నిల్వ వున్న ధనాన్ని ప్రాథమిక పాఠశాలల భవనాలను జిల్లాలోని కొన్ని చిన్న రోడ్ల నిర్మాణానికి ఉపయోగించకపోవడం గురించి చర్చించుటకు గాను.)

The motion was negatived

*Mr. Speaker*: The question is that the Government be granted a sum not exceeding Rs. 46,96,400 under demand No, XXXVI Local Administration.

The motion was adopted.

*The House then adjourned till Half Past Eight of the Clock on Thursday, the 27th March 1958.*